# పుప్పి పళ్లను కనుగొన్నాడు మా బాబు ఒకనాడు!
























## ఫోర్‌హేన్స్ ఫ్లోరైడ్

రుచికరమైన మరియు నురుగునిచ్చే టూత్‌పేస్టు
మీ పళ్లను మరియు చిగుళ్లను రెండిటినీ రక్షిస్తుంది.

FOR THE GUMS

**Forhan's**

with active FLUORIDE to check tooth decay

331 F 183 TEL



# చందమామ

జూలై 1985



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-00

సంవత్సర చందా: 24-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''గోపాలుడి శాపం'']కు ఆధారం, "వసుంధర" రచన. దేన్నీ స్వబుద్ధితో పరిశీలించకుండా, ఇతరులు చెప్పారుగదా అని నమ్మడం, ప్రమాదాలకు దారితీస్తుంది. ముఖ్యంగా మహత్తులూ, అద్భుతాలూ ప్రదర్శించగలమని చెప్పే వ్యక్తుల విషయంలో జాగరూకత అవసరం. ఇది ''నిధుల రహస్యం" అన్న కథలో చక్కగా నిరూపించబడింది.

## అమరవాణి

విద్యావినయ సంపన్నే, విద్యాహీనే జడే సతి,
స్వజనే పరకీయే చ, పండితాః సమదర్శినః.

[విద్యావినయాలు కలవాణ్ణి, అవి లేనివాణ్ణి, మూర్ఖుణ్ణి, సత్పురుషుణ్ణి, తనవాణ్ణి, ఇతరుణ్ణి—ఇలా అందరినీ విద్వాంసులు సమదృష్టితో చూస్తారు.]

సంపుటి 77 జూలై '85 సంచిక 1

విడి ప్రతి : 2–00 : : సంవత్సర చందా : 24–00



# చందమామ కబుర్లు



## మనదేశంలో తొలి నాణాలు

క్రీ॥ శ॥ మూడో శతాబ్దంలో ప్రప్రథమంగా మనదేశంలో నాణాలు ప్రవేశపెట్టబడ్డాయి. అవి వెండి నాణాలని, అలీఘర్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ ఇర్ఫాన్ హబీబ్ అభిప్రాయపడుతున్నారు.

## సరికొత్త ప్రమాణం!



ఉన్నత ప్రమాణాలుగల చలనచిత్రాలకు బహుమతులు ఇవ్వడానికి, ప్రపంచం మొత్తం మీద పలు దేశాలలో వివిధ సంస్థలు ఉన్నాయి. అయితే, వివరీతంగా విసుగు కల్గించే చిత్రాలకు బహుమతులు ఇవ్వడానికి, ఇటీవల న్యూజెర్సీలో ఒక కమిటీ ఏర్పాటయింది. "చిత్రాలను ఎంపిక చేయడానికి మా సభ్యులు ఎంతో నిద్రపోవలసి వచ్చింది," అంటున్నాడు ఆ కమిటీ కార్యదర్శి.



## ఫిల్ము లేకుండా ఎక్స్-రేలు

ఫిల్మ అవసరం లేకుండానే ఎక్స్‌రే తీసే విధానం, ప్రపంచంలో మొట్టమొదటిసారిగా, జపాన్‌లో కనుగొన్నారు. ఈ విధానం ద్వారా క్షణాలలో టెలివిజన్ తెరమీద రోగనిదానం సాధ్యమవుతుంది.

## మీకు తెలుసా?

1. హర్షవర్ధనుని పరిపాలనా కాలంలో భారత దేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు ఎవరు?
2. రెండవ పులకేశి ఏ వంశానికి చెందినవాడో మీకు తెలుసా?
3. కుతుబ్‌మీనార్ కన్నా ఎత్తయిన శిఖరం నిర్మించడానికి తలపెట్టి, అది పూర్తి కాకముందే మరణించిన సుల్తాన్ ఎవరు?
4. అక్బర్ సింహాసనాన్ని అధిష్ఠించేప్పుడు ఆయన వయసు ఎంతో మీకు తెలుసా?
5. ఛత్రపతి శివాజీ తండ్రి పేరేమిటి?

(సమాధానాలు 64 వ పేజీలో)



# మాటనేర్పరి

ఒకసారి నారదుడు ఆకాశమార్గంలో వెళుతూ, దేవదూతలు ఒక మనిషిని స్వర్గంకేసి తీసుకుపోతూండడం చూశాడు. ఆయన వాళ్ళను సమీపించి, ''ఇతనెవరు? ఎందుకు స్వర్గలోకానికి తీసుకుపోతున్నారు?'' అని అడిగాడు.

''ఇతడి పేరు శరభయ్య. బతికినన్నాళ్ళూ పాపాలు చేస్తూ బతికాడు. అయితే, యితడి స్వర్గప్రాప్తికి కారణం మాత్రం మాకు తెలియదు,'' అని ముందుకు సాగారు దేవదూతలు.

ఈ జవాబు నారదుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. జీవితకాలమంతా పాపాలు చేస్తూ బతికినవాడికి స్వర్గవాసం ఏమిటి? ఇందులో వున్న రహస్యమేమిటో తెలుసుకుందామని యమలోకం కేసి నడిచాడు.

యమధర్మరాజు, నారదుణ్ణి ఆహ్వానించి కుశలప్రశ్నలడిగాడు. తరవాత నారదుడు తాను మార్గమధ్యంలో చూసిన మనిషి వృత్తాంతం చెప్పి, తన సందేహం తీర్చమన్నాడు.

యమధర్మరాజు నవ్వి, ''శరభయ్య అనేవాడు చాలా పేదవాడు. బతికినన్నాళ్లూ చాలా పాపాలు చేశాడు. ఆ కారణంవల్ల, వాడు పూర్తిగా నరకంలోనే వుండవలసింది. అయితే, ఒకసారి ఆపదలో వున్న మరీ పేదవాడు, వాణ్ణి సాయం చేయమని అడిగాడు. వీడు అతడి పరిస్థితికి జాలిపడి—తనకు ఏ సంపాదనా లేదనీ, తన దగ్గిర డబ్బు వున్నట్టయితే తప్పకుండా యిచ్చి వుండేవాణ్ణనీ—అన్నాడు. మనస్ఫూర్తిగా అన్న ఆ మాటతో వాడి పాపాలు చాలావరకు ప్రక్షాళన చెంది, మిగిలిన కొద్ది పాపానికి నరకం అనుభవించి, ఇప్పుడు స్వర్గం వెళుతున్నాడు,'' అన్నాడు.

దాసరి వెంకటరమణ



''యమధర్మరాజా, ఇందులో ఏదో మోసం వున్నది!'' అన్నాడు నారదుడు.

''మోసమా!'' అన్నాడు యముడు.

''అవును, మోసమే. ఇతరులకు సాయపడే మనస్తత్వం వున్న మనిషి, తానెంత బీదస్థితిలో వున్నప్పటికీ, ఆపదలో వున్న మనిషి అర్థించినపుడు, తనకు కలిగింది దానం చేస్తాడు, లేదా తాను అసహాయుణ్ణని ఊరుకుంటాడు. అంతే గాని, తన దగ్గిర లేనిదాన్ని ఉంటే దానం చేసేవాణ్ణని మాటలగారడీ చెయ్యడు. అది కుత్సితబుద్ధుల మాటనేర్పరితనం! ఈ శరభయ్య అలాంటివాడని, నా అనుమానం. మీరు, వాడికి ధనం లభించేలా చేసి, ఆ తర్వాత వాడి మనసు తెలుసుకోవలసింది!'' అన్నాడు నారదుడు.

యమధర్మరాజు కింకరులను పంపి, స్వర్గద్వారం సమీపిస్తున్న శరభయ్యను తిరిగి రప్పించాడు.

ఆ తరవాత నారదుడి సలహాప్రకారం, శరభయ్యను భూమి మీద ఒక సామాన్య రైతుగా వదిలాడు. ఇప్పుడతడికి ఆదాయం వున్నది. సుఖంగా బతుకుతున్నాడు.

ఆ సమయంలో, ఆపదలో వున్న ఒకడు శరభయ్య దగ్గిరకు వచ్చి, తన కేదైనా సాయం చేయమని అడిగాడు.

శరభయ్య అతడి కేసి జాలిపడుతున్నట్టు చూసి, ''నేను సామాన్య రైతును. నా సంపాదన నాకూ, నా సంసారానికీ బొటాబొటిగా తినడానికి మాత్రమే సరిపోతున్నది. నాకు ఆదాయం మరింతగా వుండి వున్నట్టయితే, నీకు తప్పక సాయపడి వుండేవాణ్ణి!'' అన్నాడు.

''చూశారా, ధనం కళ్ళబడగానే వాడి మనసు ఎలా చలించిందో?'' అన్నాడు నారదుడు, యమధర్మరాజుతో.

"వీడింతటి నీచుడనుకోలేదు! వీణ్ణిప్పుడే తెప్పించి, నరకంలో తోస్తాను,'' అన్నాడు యమధర్మరాజు కోపంగా.

''కొంచెం ఆగి చూడండి. వాణ్ణి ఎలాగూ భూలోకంలో వదిలారు కనక,

వాడు కోరినవన్నీ యిస్తూ, వాడిలో ఎలాంటి మార్పు వస్తుందో గమనించండి,'' అన్నాడు నారదుడు.

అది మొదలు శరభయ్య పొలాలు, అందరి పొలాలకన్న అధికంగా ఫల సాయం యివ్వసాగాయి. ఆ విధంగా నాలు గేళ్ళు గడిచేసరికి, శరభయ్య ఊరి మధ్యలో అందమైన భవంతి కట్టించాడు.

ఆపదలో వున్న మరొక మనిషి శరభయ్య దగ్గిరకు వచ్చి, తనగోడు చెప్పు కుని ఏదైనా సాయం చేయమని అడిగాడు.

శరభయ్య అతడిపట్ల సానుభూతి కన బరుస్తూ, ''ఈ మధ్యే ఇల్లు కట్టించి పీక లోతున అప్పుల్లో మునిగివున్నాను. నీకేం సాయం చేయగలను చెప్పు!'' అన్నాడు.

ఆ మరుసటి ఏడే శరభయ్య, ఆసారి వచ్చిన పంటరాబడితో పట్నంలో చిన్న తరహా వ్యాపారం మొదలుపెట్టాడు. అది బాగా కలిసివచ్చింది. ఆ వచ్చిన లాభాల్లో కొంత ఖర్చుచేసి అతడు పట్నంలో పెద్ద మేడకట్టడమేగాక, వ్యాపారాన్ని మరిం తగా వృద్ధిపరిచాడు.

కష్టాల్లో వున్న మరొక మధ్యరకం మనిషి శరభయ్య వద్దకు వచ్చాడు. శరభయ్య అతడు చెప్పినదంతా శ్రద్ధగా విని, ''ఆ మధ్య పట్నంలో కట్టిన ఇంటి కోసం చేసిన అప్పుతో నలిగిపోయి, యీ



మధ్యనే దాన్నుంచి బయటపడి, కొంత తేలిగ్గా ఊపిరి తీసుకోగలుగుతున్నాను. మా పిల్లలిద్దర్నీ రాజధానిలో చదివిస్తు న్నాను. వాళ్ళ చదువుకు బోలెడంత డబ్బు ఖర్చవుతున్నది. లేనిపక్షంలో నీకు తప్పక సాయపడి వుండేవాణ్ణి,'' అన్నాడు.

ఆ తర్వాత శరభయ్యకు వ్యాపారంలో పెద్ద ఎత్తున లాభాలు వచ్చి, నాలుగు పెద్ద ఓడలు కొన్నాడు. వాటిని ఉపయో గించి విదేశాల్లో వర్తకం చెయ్యసాగాడు. అందులోనూ బాగా కలిసివచ్చి, కొద్ది కాలంలో కోటీశ్వరుడయ్యాడు. ఇప్పుడు శరభయ్య రాజ్యంలోని ప్రముఖ ధన వంతుల్లో ఒకడు.

ఆ సమయంలో ఒక అనామకుడు శరభయ్యా దర్శనానికి వచ్చాడు. శరభయ్య, అతడు చెప్పేదేమీ వినిపించుకోకుండా, ఎందుకు వచ్చింది మాత్రం అడిగి, "ఈ రోజు నేను చాలా ముఖ్యమైన పనుల్లో వున్నాను; క్షణం తీరికలేదు. రేపువస్తే, నాకు తోచినసాయం చేస్తాను," అని పంపేశాడు.

మర్నాడు అతడు ఎంతో ఆశతో శరభయ్య దగ్గిరకు వచ్చాడు. శరభయ్య అతణ్ణి చూస్తూనే, "ఎవరు నువ్వు? నాతో ఏం పని?" అని కటువుగా ప్రశ్నించాడు.

వచ్చినతను బిక్కచచ్చిపోయి, తాను నిన్న వచ్చి వెళ్ళినసంగతి గుర్తుచేసి, తన దీనచరిత్ర చెప్పబోయాడు. శరభయ్య మధ్యలోనే అతణ్ణి ఆపి, "నాకేమాత్రం తీరికలేదు. వర్తకపు పని మీద విదేశాలకు వెళుతున్నాను. తిరిగి రావడానికి మూడు నెలలైనా పడుతుంది. ఆ తర్వాత కనిపించు, తప్పకుండా సాయం చేస్తాను," అన్నాడు.

ఆ వ్యక్తి మూడు నెలలు ఓపికపట్టి, ఒక సాయంత్రంవేళ శరభయ్యను చూడ వచ్చాడు. అయితే, శరభయ్య కొత్తగా ద్వారం వద్ద కాపలావాళ్ళు, నియమించిన అతణ్ణి లోపలికి పోకుండా నెట్టివేశారు.

అతడు ఆ రాత్రంతా, శరభయ్య ఇంటి ద్వారం దగ్గిరే గడిపాడు. మర్నాడు శరభయ్య బయటికి వచ్చాడు. అయితే, శరభయ్యకు ముందూ, వెనకా, ఇరుపక్కలా వున్న కాపలావాళ్ళు, అతణ్ణి శరభయ్య దగ్గిరకు రానివ్వలేదు. అతడి అరుపులు శరభయ్య చెవిని పడినట్టులేదు. శరభయ్య కొద్ది దూరం నడిచి, ప్రత్యేక అశ్వాలను పూన్చిన రథంలాటి వాహనాన్నెక్కి ముందుకు కదిలిపోయాడు.

"ఇంక పరీక్ష చాలు. వాణ్ణి తెచ్చి నరకంలో పడెయ్యండి!" అన్నాడు నారదుడు.

యమధర్మరాజు కింకరులను పంపి, శరభయ్యను పట్టి తెప్పించి, నరకంలో తోయించాడు.






## 9

[చంద్రవర్మ కాపాలిని దగ్గిర సెలవు తీసుకుని ఉత్తర దిక్కుగా బయలుదేరాడు. ఒకచోట కనిపించిన వింత వృక్షం పండును కోసుకు తినగా అతడికి పశుపక్ష్యాదుల భాషలు తెలిసిపోయినై. మరికొంత ముందుకువెళ్ళి ఒక వేడినీటి ప్రవాహాన్ని చూసి, దానిని దాటిపోతున్న ఒకమహాసర్పం వెన్నుమీదుగా చంద్రవర్మ అవతలి ఒడ్డుకు పరిగెత్తసాగాడు. తరవాత—]

చంద్రవర్మ సర్పం వెన్ను మీదుగా పరిగెత్తుతూ ప్రవాహం మధ్యకు చేరేసరికి కళపెళలాడుతున్న నీటి నుంచి వెచ్చని ఆవిరి అతణ్ణి చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేసింది. తను ధరించిన దుస్తులు మండుతున్నవా అన్న అనుమానం కూడా అతడికి కలిగింది. ప్రవాహ వేగానికి లేచిన కొన్ని అలల నుంచి వేడినీటి తుంపరలు అతడి మీద పడినై. తను స్పృహ కోల్పోయి కింద నీటిలో పడిపోతున్నానేమో అని చంద్రవర్మ కళవెళపడ్డాడు. కాని, యింత భయంలోనూ, ఆ దుర్దాలోనూ కూడా అతడు వేగంగా ముందుకు పరిగెత్తుతూనే వున్నాడు. అతడి దృష్టి తనకన్న ముందుగా పరిగెత్తుతున్న కోతుల మీదే లగ్నమై వుంది. కొంతసేపటికి అతడి కళ్ళకు నేల కనిపించింది. చంద్రవర్మ ఒక్క ఎగురున సర్పం వెన్ను మీది నుంచి కిందికి దూకి



కొంత దూరాన కనిపించింది. ఎర్రగా నిప్పుకణాల్లా వున్న దాని రెండు కళ్ళు చూసి చంద్రవర్మ వణికిపోయాడు. ఒక వేళ దాని దృష్టి తన మీద పడటం జరిగితే, తను ప్రాణాలతో బయటపడటం అసంభవమని అతడు నిశ్చయించుకున్నాడు. కాని, అదృష్టవశాత్తూ ఆ మహా సర్పం తన తలను చంద్రవర్మ కేసి తిప్ప లేదు. కొద్దిసేపటి తరవాత దాని తల క్రమంగా చెట్లలో మరుగుపడిపోయింది. శరీరభాగం మాత్రం మెల్లిగా ముందుకు జరిగిపోతున్నది.

గబగబా దాపులనున్న చెట్ల కేసి పరిగెత్తాడు.

కొద్ది క్షణాల కాలంలో జరిగిపోయిన యీ వింత అనుభవం, చంద్రవర్మను ఆపాదమస్తకం కంపింపచేసింది. అతడు రొప్పుతూ, ఆయాసపడుతూ ఒక చెట్టు బోదెను ఆనుకుని మహాసర్పం వున్న చోటు కేసి చూశాడు.

అది యింకా వాగును దాటుతూనే వున్నది. దానికి తన వెన్ను మీదుగా పరిగెత్తిన కోతులను గురించి గానీ చంద్ర వర్మను గురించి గానీ తెలిసినట్టేలేదు. పదీ పన్నెండడుగుల వ్యాసం గల భయంకర మైన దాని నల్లనితల చంద్రవర్మకు చెట్లలో

సర్పం దృష్టి యిక తన మీద పడే అవకాశం లేదని తేల్చుకున్న తరవాత చంద్రవర్మ ధైర్యంగా ముందుకు వచ్చి తాటి బొందులా వున్న దాని శరీరాన్ని పరీక్షగా చూడసాగాడు. దాని శరీరం నూనె పూసినట్టుగా నిగనిగలాడుతున్నది. శరీరానికి కవచంలా అరచేతి వెడల్పున పొలుసులు వున్నవి. బహుశా తను కత్తితో బలంగా పొడిచినా, కత్తి మొక్క పోవటం తప్ప, సర్పం శరీరంలోకి అది దిగటం సాధ్యం కాదని అతడు తేల్చుకున్నాడు. కాని, మరు క్షణానే అతడికి అలా కత్తితో దాని శరీరాన్ని పొడిచి చూడాలనిపించింది. చంద్రవర్మ ఒర నుంచి కత్తిని దూసి సర్పాన్ని బలంగా

ఒక్కపోటు పొడిచాడు. ఖంగుమనే శబ్దం వచ్చింది. సర్పానికి ఆ కత్తిదెబ్బ చీమ కుట్టినట్టయినా లేదు.

చంద్రవర్మ మరింతగా ఆశ్చర్యపోతూ చుట్టూ కలయచూశాడు. ఫలభారంతో వంగి వున్న చెట్లను చూసేసరికి అతడికి తన ఆకలి సంగతి జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతడు కత్తిని ఒరలో పెట్టి దాపుల వున్న ఒక చెట్టు మీదికి గబగబా పాకాడు. అతడు చెట్టుకొమ్మ నుంచి ఒక మామిడిపండును కోసి నోట పెట్టుకో బోయేంతలో భీతి గొల్పే విధంగా ఒక ఏనుగు ఘీంకరించటం వినబడింది. చంద్రవర్మ చప్పున ఆ ధ్వని వచ్చినవైపు చూశాడు.

అతడి దృష్టికి ఏనుగు కనిపించలేదు. కాని, అల్లంత దూరంలో చెట్లూ పొదలూ పెనుగాలి తాకిడికి అల్లల్లాడుతున్నట్టు వూగిసలాడిపోవటం కనిపించింది. ఆ వెంటనే మరికొన్ని ఏనుగులు ఘీంకార ధ్వని చేయటం, పెద్ద పెద్ద చెట్టుకొమ్మలు ఫెళఫెళా విరిగిన శబ్దం వినపడటం జరిగింది.

చంద్రవర్మ తను వున్న చెట్టుకొమ్మ నుంచి చకచకా పాకి చిటారు కొమ్మకు పోయి, ఆ ధ్వనులు వస్తున్న వైపుకు తల తిప్పాడు. అతడి కంటబడిన దృశ్యం




ఎంత ధైర్యశాలిలోనైనా భీతిని రేకెత్తించేలా వుంది.

వేడినీటి ప్రవాహాన్ని దాటిన మహా సర్పం ఒక ఏనుగును తన శరీరంతో చుట్టబెట్టి దాన్ని మింగేందుకు పెద్దగా నోరు తెరిచి, ఏనుగు తలను ఒడిసి పట్టుకోబోతున్నది. ప్రాణాపాయ స్థితిలో వున్న ఏనుగు సర్పం పట్టు నుంచి బయట పడేందుకు ఘీంకారం చేస్తూ పెనుగులాడు తున్నది. దాని చుట్టూ చేరిన కొన్ని ఏనుగులు భీతితో చెవులు రిక్కించి, తొండాలను ఆకాశం కేసి ఎత్తి, అటూ యిటూ దొమ్మిగా పరిగెత్తుతూ ఘీంకార ధ్వనులు చేస్తున్నవి. వాటి కాళ్ళకింద

పడీ, శరీరాల రాపిడికి విరిగి అనేక వృక్షాలు పెటపెటమంటూ కూలిపడు తున్నవి. మహాసర్పం మాత్రం తన చుట్టూ జరుగుతున్న ఈ బీభత్సాన్నీ, రణగొణ ధ్వనులనూ విన్నట్టేలేదు. అది తన శరీరాన్ని ఏనుగు చుట్టూ మరింత బిగువుగా పెనవేస్తూ, క్రమంగా ఏనుగు తలను గుహ లాంటి తన నోటిలోకి లాగు కుంటున్నది.

''ఈశ్వరా, నేను మహా భయంకరమైన మరే లోకంలోనో అడుగుపెట్టాను. ఇక నీవే శరణ్యం,'' అనుకున్నాడు చంద్రవర్మ మనసులో. ఈ వేడినీటి ప్రవాహానికి చుట్టుపక్కల తను చూస్తున్న వైపరీత్యాలతో పోలిస్తే, కాపాలిని వున్న అడవి ప్రాంతం ఉద్యానవనంలా వున్నట్టు అతడికి తోచింది. తను యింకా అనేక యోజనాల దూరం నడిచి, మాంత్రికుడైన శంఖుడు వుండే గృహం చేరుకోవాలి. కాని, యీ కొద్దిదూరపు ప్రయాణంలోనే తనకు ఎదురైన వింత అనుభవాలతో చంద్రవర్మ దిగాలుపడిపోయాడు. తనకు ఏ దైవశక్తులో సహాయపడితే తప్ప, లేకపోతే యీ భయంకరారణ్యాల్లో, కొండ కనుమల్లో తను మరణించటం తథ్యమని అతడికి తోచింది.

చంద్రవర్మ యిలాంటి ఊహలతో తన ధైర్యసాహసాలనూ, ఉత్సాహాన్నీ కోల్పోయి, నీరసంగా చెట్టుకొమ్మల్లోనే సొమ్మసిలిపోయి కళ్ళు మూశాడు. అతణ్ణి



ఆ క్షణాన ఆకలి దహించటం లేదు. తను నెరవేర్చ పూనిన కార్యం ఎంత దుస్సాధ్యమయిందో అతడికి తెలిసివచ్చింది. తను మాంత్రికురాలినీ, శంఖుణ్ణీ వాళ్ళ కర్మకు వదిలి, మరెక్కైనాపోవటం బావుంటుందేమో అనుకున్నాడు. మరుక్షణం ఎక్కడికి పోవటం ? అన్న విషమసమస్య తల ఎత్తింది.

చంద్రవర్మ క్రమంగా మగతనిద్రలోకి జారుకున్నాడు. సూర్యుడు అస్తమించటం గాని, ఆ సమయంలో తమ గుహలకూ, గూళ్ళకూ, చేరే పశుపక్ష్యాదులు చేసే కలకలారావాలు గాని అతడికి తెలియవు. క్రమంగా చీకటిపడింది. ఆకాశంలో అక్కడక్కడా మిలమిల మెరిసే చుక్కలు తప్ప, చంద్రుడు లేడు. గాలి పూర్తిగా స్తంభించిపోయింది.

అలాంటి వాతావరణంలో సరిగా నడిరేయివేళ చంద్రవర్మను హఠాత్తుగా ఝంఝామారుతం తాకినట్టయి చప్పున కళ్ళు తెరవబోయాడు. కాని, యీ లోపలే అతని శరీరం చెట్టుకొమ్మల్లో నుంచి గాలి తాకిడికి పైకెగిరిపోవటం అతడు గ్రహించాడు. "నా నూరేళ్లాయుస్సూ నిండింది!" అని చంద్రవర్మ అనుకునేంతలో అతడు దభీమంటూ గొంగళిలా గుచ్చుకుంటున్న ఒకచోట వెల్లికిలా పడిపోయాడు. ''రాళ్ళ మీద పడలేదు, బతికిపోయాను!'' అనుకుంటూ చంద్రవర్మ లేవబోయేంతలో, తను వున్న ప్రదేశం అటూ యిటూ





వినిపించింది. చంద్రవర్మకు తృటి కాలంలో తను ఎక్కడ వున్నదీ అర్థమై పోయింది. తను నిద్రిస్తూవుండగా రెండు గండభేరుండపక్షులు తను వున్న చెట్టు దగ్గిరకు వచ్చి వాలినై. వాటి రెక్కల తాకిడికి పుట్టిన గాలివల్ల తను చెట్టు కొమ్మల్లోంచి ఎగిరి ఏ రాళ్ళ మీదనో పడి చావకుండా అదృష్టవశాత్తూ వచ్చి ఒక గండభేరుండపక్షి వీపు మీదపడిపోయాడు. ఏనుగు ప్రమాణంలో వున్న ఆ పక్షికి తను బహుశా ఏ చీమగానో దోమగానో తోచి వుండవచ్చు. కాని, ప్రమాదవశాత్తూ తను ఆ పక్షుల కంటపడటం జరక్కముందే, అక్కడి నుంచి మెల్లగా కిందికి దిగి పారి పోవటం మంచిది.

చంద్రవర్మ యిలా ఆలోచించి పక్షి ఈకలలో నుంచి నిశ్శబ్దంగా కిందికి దిగటానికి ప్రయత్నించేంతలో, ఆకాశం మెరిసినట్టయింది. అతడు తల పైకెత్తి చూశాడు.

ఆకాశంలో భగభగ మండిపోతూ కాంతులు వెదజల్లే ఒక పక్షి రివ్వుమంటూ తను వున్నచోటుకే దిగుతూండటం అతడి కంటబడింది. తక్షణం అతడికి మాంత్రికుడు చెప్పిన అగ్నిపక్షి సంగతి గుర్తు కొచ్చింది. ఆ అగ్నిపక్షి మాంత్రికుడైన శంఖుడిది.

వూగిసలాడటం అతడికి కనిపించింది. అతడు ఆశ్చర్యపడుతూ పక్కకు చూశాడు. అతడి దృష్టిని రెల్లుదుబ్బుల్లా ఒత్తుగా వున్న ఏదో ఆటంకపరిచింది. చంద్రవర్మ తన కళ్ళకు అడ్డం వున్న వాటిని చేతితో తాకి చూడబోయేంతలో అతడికి పక్షి ఒకటి మాట్లాడటం వినిపించింది.

''మనం యీ రాత్రి యిక్కడే గడపటం మంచిది. దగ్గిర్లో వున్న వేడి నీటి ప్రవాహం నుంచి వచ్చే గాలులు నాకెంతో సంతోషం కలిగిస్తున్నవి,'' అన్నది పక్షి.

ఆ వెంటనే కొంచెం దాపుల నుంచి మరో పక్షి అవునన్నట్టు ధ్వని చేయటం

అగ్నిపక్షి దిగి రావటం చూస్తూనే, గండభేరుండపక్షులు ముక్కులు పైకెత్తి దానికి స్వాగతం చెప్పినై. అగ్నిపక్షి సూటిగా కిందికి దిగుతూనే, "మీ కోసమే చాలా సేపటి నుంచి వెతుకుతున్నాను," అన్నది.

"అలాగా, ఏమిటా పని?" అన్న దొక గండభేరుండపక్షి.



అగ్నిపక్షి కిందికి దిగి ముక్కుతో రెక్కల నొకసారి సవరించుకుని, "నా యజమాని శంఖుడు నాకో పని ఒప్ప చెప్పాడు. అది ఏమంత కష్టమయింది కాదు. జరాభారంతో కుంగి కృశించి పోతున్న ఒకానొక మాంత్రికురాలిని తన వద్దకు తీసుకురమ్మన్నాడు. కాని, ఆ పని నావల్ల సాధ్యం కావటం లేదు. నేను పగలు చూడలేను. రాత్రివేళ నా వెలుగు చూస్తూనే, నన్ను గురించి ఆ మాంత్రికురాలు ముందుజాగ్రత్తలు తీసుకుంటున్నది. కనుక, మీరు చడీచప్పుడూ లేకుండా యీ రాత్రి ఆ మాంత్రికురాలిని ముక్కున కరుచుకుని, నా యజమాని దగ్గిరకు తీసుకువస్తే, నేను మీకు సర్వదా కృతజ్ఞురాలినై వుంటాను," అన్నది.

ఆ మాటలు వింటూనే గండభేరుండ పక్షులు ఉస్సురస్సురన్నవి. "మేము యీ రాత్రికి ఒక్క యోజన దూరం కూడా ఎగరలేం. సూర్యాస్తమయం మొదలు యిప్పటివరకూ సముద్రాల్లోని ఎన్నో దీవులు తిరిగి పొట్ట నించుకుని, రెక్కల నొప్పులు పోయేందుకు యీ ఉష్ణ ప్రవాహపు వాయువుల దగ్గిర చేరి కునికి పాట్లు పడుతున్నాం. రేపు రాత్రికి నీవు కోరిన సహాయం చెయ్యగలం," అన్నవి.

అగ్నిపక్షి సంతోషంగా రెక్కలు రెప రెపలాడించి, ఆ ప్రాంతమంతా మార్మో గేలా పెద్ద కేక పెట్టి, యిలా అన్నది:

"పట్టపగలు ఆ మాంత్రికురాలిని దొరకపుచ్చుకోవటం సాధ్యమయే పని కాదు. అది మహాజిత్తులమారి, పైగా దాని దగ్గిర మహాబలవంతులైన సేవకులు కూడా

కొందరున్నారు. ఎన్నో ఏళ్లుగా ఆ మాంత్రికు రాలు రాత్రివేళ కూడా కన్ను మూయకుండా బతుకుతూ వచ్చింది. కాని, ఆ మధ్య దానికి దేహారోగ్యం చెడటంతో, లోగడ వున్నంత మెలకువగా వుండటం లేదు. మీరు చీకటిమాటున పొంచివుండి, హఠాత్తుగా మీద పడి ముక్కుతో దాని కంఠాన్ని అడకత్తెరలోలాగా పట్టుకోగలిగారంటే, అది మంత్రోచ్చారణ చేయలేదు గనక, మీకు ఎలాంటి హానీ కలిగించలేదు. ఆ తరవాత మీరు సరాసరి నా యజమాని శంఖుడు వుండే కొండ దగ్గరకు వచ్చి, ఆ మాంత్రికురాలిని అతడి పాదాల ముందు పడవేస్తే దానికి తగిన శిక్ష, మీ యిద్దరికీ తగిన ప్రతిఫలం అతడు తప్పక యిచ్చుకుంటాడు.''

''నాకు నీ యజమాని మరేమంత పెద్ద ప్రతిఫలం ముట్టచెప్పనవసరంలేదు. ఇచ్ఛామాత్రాన సప్తసముద్రాల్లోని అన్ని దీవులకూ పోగలిగే శక్తినిస్తే చాలు,'' అన్నది ఒక గండభేరుండపక్షి.

''నాకు అంత పెద్ద ఆశ లేదు. చావనేది లేకుండా చేయగలిగిన మంత్రం ఏదైనా ఉపదేశిస్తే చాలు,'' అన్నది రెండవ పక్షి.

''ఈ పిచ్చిపక్షులు రెండూ మాంత్రికుడైన శంఖుణ్ణి దేవుడనుకుంటున్నట్టుంది!'' అనుకుని చంద్రవర్మ మనసులో నవ్వుకున్నాడు.

గండభేరుండ పక్షులు అడిగినదానికి అగ్నిపక్షి అవును కాదనకుండా తలాడించి, ''రేపు పగటివేళ నా నివాసానికి ఒకసారి రాగలరా? వీలయితే నా యజమానిని కూడా మీకు చూపెడతాను,'' అన్నది.

గండభేరుండ పక్షులు సరేనన్న సూచనగా తలలాడించినై. మరుక్షణం అగ్నిపక్షి రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరి మహావేగంతో ఉత్తర దిక్కుకేసి వెళ్ళిపోయింది. గండభేరుండ పక్షులు కొంచెంసేపు ఆ సంగతీ యీ సంగతీ మాట్టాడుకుని ముక్కులను భూమి కానించి నిద్రలోకి జారుకున్నవి. —(ఇంకావుంది)





# గోపాలుడి శాపం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి వేళ, భీతిగొల్పే యీ శ్మశానంలో నువ్వు కష్టాలపాలవడానికి కారణం, ఎవరైనా యిచ్చిన శాపమా అన్న అనుమానం కలుగుతున్నది. నువ్వు, ఏ ఋషినో, శక్తిసంపన్నుడైన ఏ యోగినో అవమానించి, వాళ్ళచేత శాపం పొందేంత జ్ఞానశూన్యుడివి కావని, నా నమ్మకం. అయినా, తెలియక రత్నపాలు డనే వ్యాపారిలా, పైకి అతిసామాన్యుడిలా కనిపించే తపశ్శాలి అయిన వ్యక్తికి కోపం తెప్పించి, అతడివల్ల శాపం పొంది వుంటావు, అవునా? నీకు మరొక ఉదాహరణగా, ఆ రత్నపాలుడి కథ చెబు

## బేతాళ కథలు



మహర్షి, నీ కోరిక తప్పక తీరుస్తాడు. అయితే, మహర్షి ఆశ్రమానికి నీ ఒక్కడివే పాదచారివై వెళ్ళవలసి వుంటుంది,'' అని చెప్పాడు.

రత్నపాలుడు ఆ విధంగానే అరణ్య మధ్యంలోని మహర్షి ఆశ్రమం చేరుకున్నాడు. అయితే, కాలినడకన ఎక్కువ దూరం పోయే అలవాటు లేనివాడవడం చేత బాగా అలిసిపోయి, ఆశ్రమం కంట బడగానే, ఒక్క అడుగు ముందుకు వెయ్యలేక కూలబడిపోయాడు.

ఆ సమయంలో ఆశ్రమం ముందు చీపురుతో ఊడ్చి శుభ్రం చేస్తున్న గోపాలుడనే కుర్రవాడు, రత్నపాలుణ్ణి చూసి పరుగున వచ్చాడు.

తాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు :

రత్నపాలుడనే వ్యాపారికి సకల సంపదలూ వున్నప్పటికీ, సంతానం లేదు. నైమిశారణ్యంలోని భువనేంద్ర మహర్షి వద్ద, సంతానాన్ని కలిగించే ఓషధి వున్నదని తెలిసి, రత్నపాలుడు ఆ అరణ్యానికి ప్రయాణమయ్యాడు. ఏడు గుర్రాలు పూన్చిన రథం మీద, ఏడు పగళ్ళూ, ఏడు రాత్రులూ ప్రయాణం చేసి, అరణ్య సమీపంలోని మునిపల్లె అనే గ్రామాన్ని చేరుకున్నాడు.

అక్కడ ఒక వృద్ధుడు రత్నపాలుడు వచ్చిన పని గురించి విని, ''భువనేంద్ర

రత్నపాలుడు అతణ్ణి, ''ఓరీ, కొంచెం సేపు, నా పాదాలొత్తగలవా ?'' అని అడిగాడు

దానికి కుర్రవాడు, ''తప్పకుండా అలాగే చేస్తాను. అయితే, నేనెంతసేపు నీకు పాదాలొత్తుతానో, అంతకు రెట్టింపుగా ఆ తర్వాత నువ్వు, నా పాదాలొత్తాలి,'' అన్నాడు.

ఒక పనివాడు తనతో అలా మాట్లాడే సరికి, రత్నపాలుడు సహించలేక పోయాడు. ఆయన కోపంగా, ''నీకు బొత్తిగా పెద్దా, చిన్నా తారతమ్యం తెలియ



నట్టుంది. నేను, నీకంటే వయసులో పెద్ద వాణ్ణి. నన్ను సేవ చెయ్యమని అడుగుతావా ?'' అన్నాడు.

''పోనీ, నీకు కొడుకు పుట్టి, నా వయసు వాడైతే, వాడికి సేవలెవరు చేస్తారో చెప్పు? వాడికంటే పెద్దవాళ్ళా ? చిన్నవాళ్ళా ?'' అని అడిగాడు గోపాలుడు.

ఈ ప్రశ్న వింటూనే రత్నపాలుడు మరింత కోపంగా ''నా కొడుకూ, నీకూ సామ్యమేమిటి? వాడు కోట్లకు వారసుడు; నువ్వు పనివాడివి.'' అన్నాడు.

ఆ మాటకు గోపాలుడు చిన్నగా నవ్వి, ''నీకు డబ్బున్నదన్న అహంకారం జాస్తిగా వున్నది. నీకెంత డబ్బున్నప్పటికీ, సంతానం కోసం బిచ్చగాడిలా, ఈ ఆశ్రమానికి వచ్చావని, నాకు తెలుసు. నీ కొడుకు, నాకన్న ఎక్కువ సేవకుడిలా పనులు చేస్తూ బతుకుతాడు,'' అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

రత్నపాలుడు, గోపాలుడి మాటలు పట్టించుకోలేదు. ఆయన మరి కాసేపు సేదతీర్చుకుని లేవబోతూండగా, ఎక్కడి నుంచో తిరిగి వస్తున్న భువనేంద్ర మహర్షి కళ్ళబడ్డాడు. మహర్షి, రత్నపాలుడికి తానెవరైందీ చెప్పి, అతడి గురించిన వివరాలు తెలుసుకుని, ''పాపం, చాలా శ్రమపడి వచ్చావు!'' అంటూ తానే రత్నపాలుణ్ణి లేవదీసి, ఆశ్రమం లోపలికి తీసుకువెళ్ళి, అతిథిమర్యాదలు చేశాడు.

రత్నపాలుడు ఆయన దయాగుణానికి ఆశ్చర్యపడుతూ, ''స్వామీ, అధికులకూ, అధములకూ ఎంత తేడా ! మహర్షి అయిన మీరు, నన్ను ఆప్యాయంగా పలకరించారు. పనివాడైన గోపాలుడు తిరస్కారంగా చూశాడు,'' అంటూ జరిగింది చెప్పాడు.

మహర్షి జరిగిందానికి తనూ ఆశ్చర్యపడి, ''నేనివ్వబోయే ఓషధివల్ల, తప్పక నీకు సంతానప్రాప్తి కలుగుతుంది. అయితే, గోపాలుడి మాటలు శాపంలా నిన్ను వేధించగలవు!'' అన్నాడు.



కారంతో వాణ్ణి హీనపరిచావు. నీ ప్రవర్తన అనాగరికంగా వున్నది. అందుకే వాడు నిన్ను శపించాడు. ఈ ఆశ్రమవాసుల శాపాలు తిరుగులేనివి,'' అన్నాడు భువనేంద్రుడు.

రత్నపాలుడు మహర్షి నేమీ అనలేక, ''స్వామీ, తప్పు నాదేనని ఒప్పుకుంటాను. నాకు కాలినడక అలవాటు లేనిపని. అలసిపోయి అలా మాట్లాడాను. దాన్ని మీరు అహంకారంగా భావించకండి. గోపాలుడి శాపం నన్ను బాధించకుండా అనుగ్రహించండి,'' అని వేడుకున్నాడు.

ఆ మాటలకు రత్నపాలుడు కలవరపడి, ''గోపాలుడి ప్రవర్తన చాలా అనాగరికంగా వున్నది. వాడి మాటలు నాకు శాపం కావడం అన్యాయం. ఇందుకు మీరే ఏదైనా మార్గం చూపాలి,'' అన్నాడు.

''గోపాలుడి ప్రవర్తనలో అనాగరికం ఏమీ లేదు. వాడు నీకు సేవలు చేస్తే, ప్రతిఫలంగా నీ నుంచి సేవలు కోరాడు. అప్పుడు నువ్వు, వాడికి పెద్దవాళ్ళు చిన్నవాళ్ళకు సేవలు చేయకూడదని చెప్పావు; అది అబద్ధం. చిన్నతనం నుంచీ యిప్పటి దాకా నువ్వు, నీకంటే పెద్దవాళ్ళ నుంచి సేవలు పొందలేదా ? అదే నీకు వాడు చెప్పాడు ! నువ్వేమో డబ్బున్న అహం

''నువ్వు నిజంగా మంచివాడివేఅయితే, నీ మంచితనమే నిన్ను రక్షిస్తుంది. మంచి వాళ్ళను ఏ శాపాలూ బాధించవు !'' అని భువనేంద్రమహర్షి ఒక ఓషధిని రత్నపాలుడి కిచ్చి, ''దీనిని నీ భార్య కివ్వు. దీని మహిమతో నీ భార్య గర్భం ధరిస్తుంది. నవమాసాలూ మోసి పండంటి కొడుకును కంటుంది. సరిగ్గా ఆ సమయానికే, నీ ఇంటి దాసీకూ్కడా ఒక కొడుకు పుడతాడు. పుట్టీపుట్టగానే నీ బిడ్డ దాసీకి చేరుతుంది; దాసీ బిడ్డ నీకు చేరుతుంది. ఆ తర్వాత, ఆ దాసీ నీ కళ్ళబడదు. ఎప్పుడో ఒక రోజున గోపాలుడు, మీ ఊరుకు వస్తాడు. అతడికి తృప్తికలిగించి, నీ బిడ్డ ఆచూకీ తెలుసుకోగలవు,'' అన్నాడు.

రత్నపాలుడు ఓషధి తీసుకుని తిరిగి తన ఊరు చేరుకున్నాడు. అటుపైన అంతా భువనేంద్రుడు చెప్పినట్టే జరిగింది. రత్నపాలుడు హతాశుడయ్యాడు. తనది కాని బిడ్డను అందలమెక్కిస్తుందన్న భయంతో, భార్యకు మాత్రం ఆయన నిజం చెప్పి, "మన బిడ్డ మరికొద్ది సంవత్సరాల తర్వాతే మన మధ్యకు వస్తాడు. నువ్వు, వీడిపై మమకారం పెంచుకున్నావంటే, అప్పుడు దాసి మల్లికకు వీణ్ణి అప్ప గించడం కష్టమవుతుంది. ఇదంతా మన దురదృష్టం. జరిగిం దెవరికీ చెప్పకుండా రహస్యంగా వుంచుదాం," అన్నాడు.



ఇది విని రత్నపాలుడి భార్య ఎంతగానో రోదించింది. అటు పైన బిడ్డను దాసీల పరం చేసింది. వాడు సేవకులలో ఒకడుగా పెరిగి పెద్దవాడవసాగాడు. అందరితోపాటు వాడూ ఇంటిల్లిపాదికీ సేవలు చేసేవాడు.

రత్నపాలుడి మిత్రులు కొందరిది చూసి కారణం అడిగారు. వారి కాయన, "లేక లేక కలిగిన బిడ్డ. వాడినలాగే పెంచమని మహర్షి ఆన!" అని బదులిచ్చాడు.

ఈ విధంగా పది సంవత్సరాలు గడి చాయి. ఒకనాడు రత్నపాలుడికి, గోపాలు డనే గొప్ప యోగి ఊళ్లోకి వచ్చినట్టు తెలిసింది. ఆయన వెంటనే అతడున్న చోటుకు వెళ్ళాడు. అ సమయంలో గోపాలుడు ఒక స్త్రీతో, "నువ్వు తల్లినీ, బిడ్డనూ విడదీశావు. నీ కష్టాలన్నిటికీ కారణం అదే! మళ్ళీ ఆ తల్లీ బిడ్డలను కలుపు. నీ కష్టాలు తీరిపోతాయి," అంటున్నాడు.

రత్నపాలుడు కోపం పట్టలేక గోపాలుడి ముందుకు వెళ్ళి, "స్వామీ, తమరు భువనేంద్రమహర్షి ఆశ్రమంలో వుండే గోపాలుడేనా?" అని అడిగాడు.

"అవును," అంటూ తల ఊపాడు యోగి.

అప్పుడు రత్నపాలుడు అక్కడ చేరిన వారి ముందు తన కథ చెప్పుకుని, "స్వల్ప కారణానికి శాపమిచ్చి, తల్లీ బిడ్డలను

వేరు చేసిన మీరు, ఎటువంటి కష్టాలకు గురి అయ్యారో సెలవివ్వండి,'' అన్నాడు.

గోపాలుడు చిన్నగా నవ్వి, ''నేను ఎవరినీ వేరు చెయ్యలేదు. ఇంతకాలంగా, నీ ఇంట పెరుగుతున్నవాడు, నీ సొంత బిడ్డే!'' అన్నాడు.

రత్నపాలుడు పరమానందంతో గోపాలుడి పాదాలను కళ్ళకద్దుకుని, పరుగుపరుగున ఇంటికి వెళ్ళాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, ''రాజా, రత్నపాలుడి బిడ్డ కానివాణ్ణి, అతడి బిడ్డే అంటూ గోపాలుడు ఎందుకు అబద్ధం చెప్పాడు? తను తొందరపడి యిచ్చిన శాపానికి పశ్చాత్తాపపడినందువల్లనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''భువనేంద్ర మహర్షి అంతవాడికి శిష్యుడైన గోపాలుడు అబద్ధం చెప్పాడనడం ఉచితం కాదు. రత్నపాలుడి వింత అనుభవాలకు, అతడి కల్మషాత్మే కారణం. తాను గోపాలుడి శాపానికి గురయ్యానన్న భయం అతణ్ణి పీడించింది. అతడు మహర్షి చేసిన హెచ్చరికలోని గూఢార్థాన్ని గ్రహించలేదు. అందుకు అతడి అహంకారం అడ్డు నిలిచింది. మంచివాళ్లను ఏ శాపాలూ బాధించవని, మహర్షి అతడికి చెప్పాడు. అయినా, రత్నపాలుడు బిడ్డల మార్పిడి జరిగిందన్న భ్రమలో, తన బిడ్డను దాసీల పరం చేశాడు. ఇది అతడిలోని చెడ్డ గుణానికి నిదర్శనం. ప్రసవించిన దాసీ కనిపించకుండాపోవడం, గోపాలుడు ఒక స్త్రీని బిడ్డలను వేరు చేశావంటూ కోప్పడడం—ఇవన్నీ కాకతాళీయంగా జరిగిన సంఘటనలు. పుట్టిననాటి నుంచీ రత్నపాలుడి ఇంట పెరిగిన బిడ్డ, భువనేంద్ర మహర్షి యిచ్చిన ఓషధీ మహిమవల్ల కలిగినవాడనడంలో సందేహంలేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# వడ్డీతో సహా

ఒక ఊళ్ళో ఒక పేద రైతు ఉండేవాడు. పంటలు పండక, అప్పులు చేసి, పంటలు పండినప్పుడు ఫలసాయమంతా వడ్డీ కింద చెల్లుగట్టి, ఆ రైతు అడుగంటాడు.

ఆ స్థితిలో వాడు వడ్డీ వ్యాపారి దగ్గిరికి వెళ్ళి, "ఇదుగో చూడు, నా దగ్గిర నుంచి ఇక నీకు చిల్లిగవ్వ కూడా రాదు. నాకు ఉన్నదంతా అయిపోయింది. నువు చాలా డబ్బు గడించినవాడివి గనక ఆ కిటుకేదో చెబితివా నేను కూడా సుఖంగా బతుకుతాను," అన్నాడు.

"ఓరి పిచ్చివాడా! డబ్బు, ఆ రాముడివ్వవలిసిందే," అన్నాడు వడ్డీ వ్యాపారి.

రైతు ఆ రాముణ్ణి అడిగి డబ్బు తెచ్చుకోవటానికి ప్రయాణమయాడు. వాడి భార్య వాడికి మూడు రొట్టెలు కట్టి ఇచ్చింది. కొంతదూరం పోయాక రైతుకు ఒక సద్బ్రాహ్మడు ఎదురయాడు. రైతు తన మూట విప్పి ఒక రొట్టె ఆ బ్రాహ్మడి చేతిలో పెట్టి, "స్వామీ, నేను రాముణ్ణి చూద్దామని పోతున్నాను. తమకు తెలిస్తే దారి కాస్త చెబుతారా?" అన్నాడు.

బ్రాహ్మడు రొట్టె తీసుకుని, ఆకాశం కేసి చూసి కళ్ళు మూసుకుని ఏమీ అనకుండా తన దారిన తాను పోయాడు.

రైతు మరి కొంతదూరం వెళ్ళాక ఒక యోగి ఎదురయాడు. రైతు యోగికి ప్రణమిల్లి లేచి, తన మూటలో నుంచి ఇంకొక రొట్టె తీసి ఇచ్చుకుని, "స్వామీ, రాముడి దగ్గిరికి వెళ్ళాలి దారి ఎటు?" అని అడిగాడు. యోగి మౌనస్వామి లాగా మాట్లాడక తన దారిన తాను వెళ్ళాడు.

మరి కొంత దూరం వెళ్ళాక దారిపక్క ఒక పేదవాడు కనిపించాడు. ఆ మనిషిని చూస్తేనే ఎంతో కాలంగా అన్నం తిన్న పాపాన పోయినట్టులేదు. రైతు అతణ్ణి

చూసి జాలిపడి, తన వెంట తెచ్చిన మూడో రొట్టె ఇచ్చి తినమన్నాడు.

ఆ పేదవాడు ఆ రొట్టెను తిని, ''ఎక్కడికి పోతున్నావు, బాబూ ?'' అని అడిగాడు.

''రాముణ్ణి చూస్తే డబ్బిస్తాడట, చూడ బోతున్నాను. ఎవరి నడిగినా దారి చెప్ప కుండా ఉన్నారు. తెలిస్తే కాస్త చెబుదూ!" అన్నాడు రైతు.

పేదవాడు నవ్వి, ''నేనే రాముణ్ణి. నువు ఎక్కడికీ పోనవసరం లేదు. ఇదుగో ఈ శంఖం తీసుకో. దీన్ని ఎలా ఊదాలో నేను చెబుతాను. నువు ఏది కోరినా ఈ శంఖం ఊదగానే ఆ కోరిక సిద్ధిస్తుంది,'' అన్నాడు. రైతు ఆ రాముడి సహాయంతో ఆ శంఖం ఊదటంలో గల కిటుకు తెలుసుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. అది మొదలు రైతుకు ఏ లోటూ లేదు. ఏది కావాలన్నా శంఖం ఊదగానే వచ్చేసేది.

ఒకనాడు వడ్డీ వ్యాపారి రైతు దగ్గిరికి వెళ్ళి సంగతంతా తెలుసుకున్నాడు. తరవాత వాడు రైతు శంఖం దొంగిలించి తన ఇంటికి తీసుకుపోయాడు. కాని వాడికి దాన్ని ఊదే వైనం తెలియలేదు.

అందుచేత వడ్డీ వ్యాపారి రైతు వద్దకు వచ్చి, ''ఇదుగో చూడు, నీ శంఖం నా దగ్గిరికి వచ్చింది. నీకు దాన్ని ఒక్క షరతు మీద అయితే యిస్తాను. ఆ శంఖం వల్ల నీకు ఎంత కలిగితే నాకు రెట్టింపు కలగాలి. అలా కాదంటే నేనా శంఖాన్ని నీ పాత బాకీకింద జమ వేసుకుంటాను,'' అన్నాడు.

విధిలేక రైతు సరేనన్నాడు. వడ్డీ వ్యాపారి శంఖం తిరిగి ఇచ్చాడు. అది మొదలు శంఖం రైతుకు ఏమిచ్చినా వడ్డీ వ్యాపారికి రెట్టింపు ఇస్తూ ఉండేది.

ఇంతలో ఒకనాడు రైతుకు ఒక గొప్ప ఆలోచన వచ్చింది. వాడు తన మనస్సులో, ''నా కన్ను ఒకటి పోవాలి!'' అని కోరుకుని శంఖం ఊదాడు. రైతుకు ఒక కన్ను పోయింది. వడ్డీ వ్యాపారి రెండు కళ్ళూ పోయాయి. రైతుకు తృప్తి కలిగింది.





# నిధుల రహస్యం

కోసలదేశపు రాజు సూర్యసేనుడు డెబ్భై ఏళ్ళ వృద్ధుడు. వృద్ధాప్యంతోపాటు ఆయనకు అనారోగ్యం కూడా దాపురించింది. ఈ కారణంగా ఆయన రాజ్య పాలనా వ్యవహారాల్లో శ్రద్ధ చూపలేక పోయాడు. దానితో దేశంలో అరాజకం ప్రబలి దొంగతనాలూ, దారిదోపిడీలూ ప్రారంభమయాయి. కోసలను తన దేశంలో కలుపుకోవాలని చూస్తున్న విదేహ రాజుకు, యిది మంచి అదనుగా తోచి యుద్ధప్రయత్నాలు చేయసాగాడు.

ఇలాంటి సమయంలో, దూరదేశంలో విద్యాభ్యాసం ముగించుకుని యువరాజు చతురసేనుడు రాజధానికి తిరిగి వచ్చాడు. మంత్రి, రాజును కలుసుకుని యువ రాజుకు పట్టాభిషేకం చేసి, పరిపాలనా భారం అతడికి వదలడం బావుంటుందని సలహా యిచ్చాడు.

సూర్యసేనుడికి యీ సలహా నచ్చ లేదు. ఏమాత్రం అనుభవంలేని వాడికి రాజ్యాన్ని అప్పగించడం ప్రమాద కారణ మవుతుందని, ఆయన అభిప్రాయపడ్డాడు. అయినా, కొడుకుకున్న లోకజ్ఞానం, వివేకం ఏపాటో తెలుసుకోదలచి, అతణ్ణి పిలిపించి, సంగతి చెప్పి ఏం చేస్తే బావుంటుందని అడిగాడు.

చతురసేనుడు కొంతసేపు ఆలోచించి, "ముందు విదేహరాజు దాడిని ఎదుర్కొనేందుకు వీలుగా కోటగోడలు బలపరిచి, సైన్యాన్ని సిద్ధం చేద్దాం." అన్నాడు.

"మన దేశంలోనే వుంటూ అరాజకం సృష్టిస్తున్నవాళ్ళ మాటేమిటి? బయట నుంచి వచ్చే శత్రువుకన్న, దేశంలోనే వున్న యీ దుష్టశక్తులు ఎక్కువ ప్రమాద కరం కదా?" అన్నాడు సూర్యసేనుడు కొడుకుతో.

గుంటక సాంబిరెడ్డి



ఆ ప్రశ్నకు చతురసేనుడు, "దేశంలో జరుగుతున్న యీ దొంగతనాలూ, దారి దోపిడీలవల్ల ప్రజలు తాత్కాలికంగా బాధలకు గురి అయే మాట నిజం. కాని, వాళ్ళు దొంగిలించిన ధనం మన దేశం దాటి పోదు గదా! మనం ఆ దుష్టులను పట్టుకున్నప్పుడు, వాళ్ళు దోచుకున్న ధనాన్నీ, వాళ్ళ ఆస్తిపాస్తులన్నీ స్వాధీనం చేసుకుని, నష్టపోయినవాళ్ళకు ధనసహాయం చేద్దాం," అన్నాడు.

"అంటే, నీ దృష్టిలో బయట నుంచి దాడి చేయనున్న శత్రురాజు ఎక్కువ ప్రమాదకారుడని! అంతేనా?" అని అడిగాడు సూర్యసేనుడు.

"నా అభిప్రాయం అదే, నాన్నా. మనం తగిన రక్షణ ఏర్పాట్లు చేసుకోవడం అవసరం. యుద్ధంలో మనం విదేహ రాజుకు ఓడడం జరిగితే—అతడి సైనికులు మన ప్రజల ఆస్తిపాస్తులను పూర్తిగా కొల్లగొడతారు. మన సింహాసనం శత్రువు హస్తగతమవుతుంది," అన్నాడు చతురసేనుడు.

కొడుకు యిలా చెప్పిన తరవాత రాజు సూర్యసేనుడు, కోట గోడలు బాగు చేయించే విషయం గురించి కొంతసేపు ఆలోచించి, కోశాధికారిని పిలిపించాడు. అతడు లెక్కలు కట్టి, యిప్పుడు కోశాగారంలో వున్న ధనం మరమ్మతు ఖర్చులకు సరిపోదని తేల్చాడు.

ఇప్పుడేం చేయడమా అని సూర్యసేనుడు మథనపడుతున్నంతలో, సేనానాయకుడు యిద్దరు గూఢచారులతో అక్కడికి వచ్చి, "మహారాజా, మన గూఢచారుల ద్వారా ఒక వింత సంగతి తెలియవచ్చింది. ఎవరో సాధువు గత నెల రోజులుగా మన నగరంలో వుంటున్నాడు. అతడు చాలా మహిమలున్నవాడని చెబుతున్నారు. తన దర్శనానికి వచ్చిన వాళ్ళందరికీ, వాళ్ళ పూర్వులు ఇళ్ళల్లో దాచిననిధులను గురించి వివరంగా చెబుతున్నాడట. ఆ విధంగా చాలామంది

లాభం పొందారు. తమరు కూడా, ఆ సాధు వును దర్శించడం వల్ల మేలు కలగవచ్చు గదా!'' అన్నాడు.

సూర్యసేనుడికి, సేనానాయకుడి రాజ భక్తిలో, సమర్థతలో గట్టి నమ్మకం వున్నది. ఆయన అప్పటికప్పుడే బయలు దేరి సాధువును కలుసుకుని, తనకు ఎదు రైన సమస్య గురించి చెప్పాడు.



సాధువు కొద్దిసేపు కళ్ళు మూసుకుని తెరిచి, ''రాజా, నేను యోగదృష్టితో అంతా పరిశీలించాను. ఇప్పట్లో ఏ పొరుగు రాజువల్లా, నీ రాజ్యానికి ప్రమాదం లేదు. అయితే ఒక సంగతి; నీ పూర్వీకులు కోట ప్రధాన ద్వారానికి రెండు వైపులా కోట గోడ కింద నూరు బిందెల బంగారం దాచి పెట్టారు. అది తవ్వించి తీసుకుంటే, నీ డబ్బు సమస్యపరిష్కారం అయి పోతుంది,'' అన్నాడు.

రాజు తృప్తిపడి, సాధువుకు ఎంతో భక్తిపూర్వకంగా నమస్కరించి తన భవనానికి తిరిగి వచ్చాడు.

తండ్రి చెప్పినది విని యువరాజు చతురసేనుడు చాలా ఆశ్చర్యపడి, ''ఒక వేళ సాధువు చెప్పిన మాట నిజమే అయినా, శత్రురాజు దాడి ప్రమాదం వున్న యిప్పటి పరిస్థితుల్లో కోట గోడలు పడగొట్టడం తెలివైనపని కాదు. సాధువు నిధి వున్నదని చెప్పిన ప్రదేశంలోని కోట గోడ ఎలాంటి మరమ్మతుల అవసరం లేకుండా, చాలా బలంగా వున్నది. మన రాజ్యంలో కోట గోడపునాదుల్లో తప్ప మరెక్కడా నిధులు లేవా? ముందు ఆ సాధువుకున్న మహిమలు ఏపాటో పరీక్షిం చేందుకు, నాకొక వారం రోజులు గడు వివ్వండి,'' అని అడిగాడు.

సూర్యసేనుడు ఒప్పుకున్నాడు.

యువరాజు, ఆస్థాన విదూషకుడితో రహస్యంగా మాట్లాడి, అతడి ఇంటి పెర టిలో తూర్పువైపున వెయ్యి బంగారు నాణాలు పాతిపెట్టించాడు. తరవాత విదూషకుడు సాధువు దగ్గిరకు వెళ్ళి,



సాష్టాంగపడి, ''స్వామీ, నే నింతంతన రాని డబ్బు చిక్కుల్లో వున్నాను. ఒక్క వేయి వరహాలైనా వుంటేగాని, నేను వాటి నుంచి బయటపడలేను. మీరు అందరికీ వాళ్ళ, వాళ్ళ ఇళ్ళల్లోని నిధుల సంగతి చెబుతున్నారు గదా! నా మీద దయ తలచి, నా ఇంట్లో కూడా ఏవైనా నిధులు దొరికే అవకాశం వుంటే చెప్పి, నన్ను గట్టెక్కించండి,'' అన్నాడు దీనంగా.

సాధువు ఒకటి, రెండు నిమిషాలు ఆలోచిస్తూ పూరుకుని, ''నాయనా, యీ రోజు నేను యోగదృష్టితో నిధులను పరిశీలించే సమయం దాటిపోయింది. రేపు ఉదయం వచ్చినట్టయితే, నీ ఇంట నిధులు దొరికేదీ లేనిదీ చెబుతాను,'' అన్నాడు.

ఆ రాత్రి యువరాజు చతురసేనుడు రహస్యంగా విదూషకుడి ఇంటికి వెళ్లాడు. అర్ధరాత్రి తర్వాత యిద్దరు మనుషులు పెరటిగోడ దూకి మెల్లగా లోపలికి రావడం, విదూషకుడూ, యువరాజూ చూశారు. వాళ్ళు, సేనాని లోగడ రాజు దగ్గిరకు వెంటబెట్టుకు వచ్చిన గూఢచారులు.

ఆ ఇద్దరూ పెరట్లో పడమటివైపున వున్న మామిడిచెట్టు కింద గుంట తవ్వి, ఏదో వస్తువుపెట్టి, నేలను ఎప్పటిలా చదునుచేసి వెళ్ళిపోయారు.

వాళ్ళు అటు వెళ్ళగానే యువరాజూ, విదూషకుడూ అక్కడికి వెళ్ళి తవ్వి చూశారు. ఒక చిన్న రాగిపాత్రలో వెయ్యి బంగారు నాణాలు కనిపించినై. వాళ్ళు ఎప్పటిలా దాన్ని భూమిలోపెట్టి, పైన మట్టి కప్పారు.

మర్నాటి ఉదయం విదూషకుడు సాధువు దగ్గిరకు వెళ్ళాడు. సాధువు అతడితో, ''నాయనా, నీ ఇంట నిధులేమైనా వున్నదేమో అని యోగదృష్టితో చూశాను. నీ పెరటిలో పడమటివైపునున్న మామిడిచెట్టు పాదులో నిధి వున్నది. దాన్ని తవ్వి తీసుకుని, నీ కష్టాల నుంచి బయటపడు.'' అని చెప్పాడు.



విదూషకుడు రాజభవనానికి తిరిగి వచ్చి యువరాజుతో సాధువు అన్న మాటలు చెప్పాడు. యువరాజు విదూషకుణ్ణి వెంటబెట్టుకుని తండ్రి దగ్గిరకు పోయి జరిగింది చెప్పి, ''నాన్నా, ఆ సాధువు నిజంగా మహిమలు కలవాడైతే, మేం పాతిపెట్టిన ధనం గురించి చెప్పవలసింది! అలా జరగలేదు. అతడు శత్రు గూఢచారి అని నిస్సందేహంగా మనం నమ్మవచ్చు. మన సేనానాయకుడూ, మన గూఢచారుల్లోని కొందరూ కలిసి, యిలా నిధులంటూ ధనం పాతిపెట్టి, అమాయకుల్ని మోసం చేస్తున్నారు. నిధులున్నవనే నెపంతో, బలంగా వున్న మన కోట ముఖ ద్వారాన్ని పడగొట్టించడం, విదేహరాజు వేసిన పథకంలో ఒక భాగం,'' అన్నాడు.

ఇది విన్నాక రాజు సూర్యసేనుడికి, సేనానాయకుడి రాజభక్తిపట్ల కొంత అనుమానం కలిగింది. అయినా, ఆయన వెంటనే అతణ్ణి బంధించవలసిందిగా ఆజ్ఞాపించక, యువరాజుతో, ''ఆ సాధువు రూపంలో వచ్చిన గూఢచారి, నగరంలో చాలామందిని తన దొంగమహిమలతో మోసగించినట్టే, సేనానాయకుణ్ణి కూడా మోసగించి వుండవచ్చు గదా? అతడి రాజభక్తిని శంకించడానికి, నాకెందుకనో మనసు ఒప్పడం లేదు,'' అన్నాడు.

''అయితే, యీ రాత్రికి ఒక పని చేద్దాం. మనం మారువేషాల్లో, ఆ సాధువు వుంటున్న ఇంటికిపోయి, అతణ్ణి చూడ వచ్చినవాళ్ళల్లో మన గూఢచారు లెవరైనా వుంటే వాళ్ళను బంధించుదాం. తరవాత వాళ్ళ నుంచి నిజం రాబట్టవచ్చు.'' అన్నాడు యువరాజు.

రాజు ఇందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ ఆ రాత్రి మారువేషాలు ధరించి, పది మంది సైనికులను వెంటబెట్టుకుని, సాధువు ఇంటికి వెళ్ళారు. వాళ్ళు సైనికులను దూరంగా దాగివుండమని, తెరిచి వున్న సాధువు ఇంటి కిటికీ పక్కన నిలబడ్డారు.

కొంతసేపటికి సేనానాయకుడు యిద్దరు అనుచరులతో అక్కడికి వచ్చాడు. సాధువు అతణ్ణి చూస్తూనే, "రాజు పూర్తిగా నా యోగదృష్టిని నమ్మినట్టే గదా ?" అని అడిగాడు.

"ఆఁ, నమ్మినట్టే. విదూషకుడి పెరట్లో నిధి దొరకడంతో, యితర రాజోద్యోగులు కూడా మీ మహిమల్ని నమ్ముతున్నారు. ఒకటి, రెండు రోజుల్లో నిధి కోసం రాజు కోట ముఖద్వారాన్ని పడగొట్టించి, దాని పునాదులు తవ్వించవచ్చు." అన్నాడు సేనానాయకుడు చిన్నగా నవ్వుతూ.

ఆ వెంటనే రాజూ, యువరాజూ యివతలికివచ్చి, దాగి వున్న సైనికులను హెచ్చరించారు. వాళ్ళు సాధువునూ సేనానాయకుణ్ణీ, అతడి అనుచరులనూ బంధించి కారాగారంలో పడవేశారు.

ఇద్దరూ భవనానికి తిరిగి వచ్చాక, రాజు సూర్యసేనుడు మంత్రికి కబురు పంపి, ఆయన రాగానే, "మీ సలహాను మొదట్లోనే, నేను పాటించి యువరాజుకు సింహాసనం కట్టబెడితే సరిపోయేది. ఆ దుర్మార్గులు మనం నిధికోసం కోటగోడలు పడగొట్టాక, దాడి రావలసిందిగా విదేహ రాజుకు వర్తమానం పంపివుండేవాళ్ళు. పెద్ద ప్రమాదం తప్పింది. త్వరలో యువరాజు పట్టాభిషేకానికి ఏర్పాట్లు చెయ్యండి," అని చెప్పాడు.

వారం రోజుల తరవాత చతురసేనుడికి పట్టాభిషేకం జరిగింది. అతడు రాజవుతూనే లోగడ అనుభవం గుర్తుంచుకుని, గూఢచారిశాఖ యికనుంచి కాబోయే సేనానాయకుడి ఆధీనంలో కాక, తన ఆధీనంలో వుంటుందని ప్రకటించాడు.

ఈ విధంగా విదేహ రాజు పథకం భగ్నమైపోయింది. అతడు యుద్ధప్రయత్నాలు మానుకున్నాడు.

తన కొడుకు శక్తిసామర్థ్యాలు స్వయంగా చూసిన రాజు సూర్యసేనుడు, నిశ్చింతగా మిగిలిన తన జీవితకాలాన్ని విశ్రాంతితో గడిపాడు.





# బంగారు నెమలి

బోధిసత్వుడు ఒకప్పుడు, బ్రహ్మదత్తుని కాశీరాజ్యంలో ఒక నెమలిగా జన్మించాడు. అది మామూలు అన్ని నెమళ్ళ వంటిది కాదు. అపురూపమైన బంగారు నెమలి! అది దండకారణ్యంలో విహరిస్తూ ఉండేది.

ఒకనాడు కాశీరాజు భార్యలలో ఒక ఆమెకు ఈ బంగారు నెమలి కలలో కనబడగా, అది కావాలని ఆమె భర్తతో చెప్పింది. రాజు మంత్రులను అడిగాడు. వారు బ్రాహ్మలకు తెలుస్తుందన్నారు. బ్రాహ్మల నడిగితే వారు వేటగాండ్రకు తెలుస్తుందని చెప్పారు.

రాజు దండకారణ్యానికి సమీపంలో వుండే ఒక వేటగాణ్ణి రప్పించి, "ఫలాని బంగారు నెమలిని జీవాలతో తీసుకువస్తే గొప్ప బహుమానం ఇస్తాము," అని చెప్పాడు. వేటగాడు అంగీకరించి వరుసగా ఏడేళ్ళు మాటు వేశాడు. కాని, నెమలి వలలో పడలేదు. వేటగాడు చనిపోయాడు. నెమలిని కోరిన ఆ రాణీ కూడా చచ్చిపోయింది.

"కలలో కనబడిన ఒక నెమలి కోసం బెంగపెట్టుకుని, నా రాణి మరణించటమా!" అని రాజుకు కోపం వచ్చింది. అప్పుడాయన, "దండకారణ్యంలో బంగారు నెమలి సంచరిస్తూ వుంది. దాని మాంసం తిన్న వాళ్ళకు జరామరణాలు ఉండవు," అంటూ ఒక ప్రకటన కోట గుమ్మం ముందు వేలాడగట్టించాడు.

ఆ రాజు తదనంతరం యువరాజు మళ్ళీ ఇంకో వేటగాడిని బంగారు నెమలి కోసం పంపించాడు. లాభం లేకపోయింది. ఇలా ఆరు తరాలు గడచిపోయినై.

ఏడవసారి గద్దె ఎక్కిన రాజు కూడా ఆ ప్రకటన చూసి, వేటగాడిని పంపాడు.

వేటగాడు యుక్తిగా ఆ నెమలిని పట్టివేసి కాశీరాజుకు వప్పగించాడు.

ఆ బంగారు నెమలిని చూడగానే రాజుకు ఆశ్చర్యం కలిగి, గౌరవభావం ఏర్పడింది. దానికి ఎత్తయిన ఒక సింహాసనం తన పక్కన వేయించాడు.

అప్పుడు నెమలి రూపంలో ఉన్న బోధిసత్వుడు, "రాజా! నన్నెందుకు పట్టించి ఇక్కడికి తెప్పించావు?" అని అడిగాడు.

"నీ మాంసం తింటే జరామరణాలు లేవని చెబుతున్నారు," అన్నాడు రాజు.

"అంటే, నన్ను చంపవలసిందేకదా?" అని ప్రశ్నించాడు బోధిసత్వుడు.

"అవును" అన్నాడు రాజు.

"పిచ్చివాడా! నాకే మరణం నిజమైతే నా మాంసం తిన్నవాళ్ళకు మరణం లేక పోవడ మేమిటి?" అని మళ్ళీ ప్రశ్నించాడు బోధిసత్వుడు.

"నీది బంగారు చాయ. కనుక, నీ మాంసం తిన్నవాళ్ళకు ఆ చాయ వస్తుందనీ, వాళ్ళకు చావు ఉండదనీ అంటున్నారు," అని చెప్పాడు రాజు.

"అయితే రాజా! నాకీ బంగారు చాయ వచ్చిన కారణం చెబుతా విను: ఒకప్పుడు నేనీ రాజ్యానికే మహారాజుగా ఉండేవాడిని. నేను న్యాయంగా పాలించి ధర్మం నిలబెట్టినందుకు ఫలితంగా ఈ జన్మలో బంగారు నెమలిగా పుట్టాను," అని చెప్పాడు బోధిసత్వుడు.

కాశీరాజు విస్తుపోయాడు. "ఏమిటీ, ధర్మ పరిపాలనకు ఫలితమా ఇది! నీ మాటకు రుజువేమిటి?" అని అడిగాడు.

"లేకేమి? నేను మహారాజుగా ఉన్న కాలంలో ఒక నవరత్న ఖచితమైన దివ్య రథం మీద విహారం చేసేవాడిని. అది ఉద్యానవనంలో కొలను పక్కన పూడ్చబడి వుంది," అన్నాడు బోధిసత్వుడు.

కాశీరాజు ఆ ప్రకారం కొలనుపక్కన తవ్వించగా దివ్యరథం కనిపించింది!

ఆనాటి నుండి రాజు బోధిసత్వుని తన గురువుగా ఎంచుకొన్నాడు.






మన నదులు :

# గంగ—2

అయోధ్యకు రాజైన సగరుడు ఒకసారి యజ్ఞం చేయడానికి తలపెట్టాడు. ఆచారం ప్రకారం, చక్కగా అలంకరించిన ఒక బలమైన గుర్రానికి జెండా కట్టి, ముందు నడిపిస్తూ దాని వెంట రాజకుమారులూ, సైనికులూ బయలు దేరారు. యజ్ఞాశ్వం వివిధ రాజ్యాలు తిరగసాగింది.

అశ్వరక్షకులు అదమరచి ఉన్న సమయం చూసి, ఇంద్రుడు రాక్షసుడి రూపంలో వచ్చి, గుర్రాన్ని దొంగిలించుకునిపోయి, పాతాళలోకంలోని కపిలుడి ఆశ్రమంలో కట్టివేశాడు.





సగరుడికి అరవై వేలమంది కుమారులు. వాళ్ళందరూ నలుదిశలా తిరిగి వెతుక్కుంటూ, పాతాళానికి పోయి అక్కడ తమ గుర్రం ఉండడం కనిపెట్టారు. ముని అయిన కపిలుడే తమ గుర్రాన్ని దొంగిలించి ఉంటాడనుకుని, రాజకుమారులు నిర్దోషి అయిన కపిలుని అవమానించారు.



వాళ్ళ దుందుడుకుతనం కపిలుడికి చెప్పలేనంత ఆగ్రహం కల్గించింది. దురహంకారులైన వాళ్ళందరూ భస్మమై పోవాలని శపించాడు. ఆ క్షణమే రాకుమారులందరూ మంటల పాలయ్యారు.

చాలా యేళ్ళు గడిచాక, సగరుడి మనమడైన అంశుమంతుడు, తమ తండ్రులను బతికించమని కపిలుని ప్రార్థించాడు. బ్రహ్మ కమండలంలోని పవిత్ర గంగాజలం భస్మరాసులను స్పృశిస్తేనే, సగరకుమారులు పునరుజ్జీవులు కాగలరని కపిలుడు అతనికి తెలియజేశాడు.






మరి కొంతకాలానికి సగరుడి ముని మనమడైన భగీరథుడు, భస్మరాసులుగా ఉన్న తన పూర్వీకులను బతికించుకోవాలని పట్టుబట్టి, బ్రహ్మను గురించి గొప్ప తపస్సు చేశాడు. అతని తపస్సుకు బ్రహ్మ సంతోషించి, తన కమండలంలోని గంగాజలం వదలడానికి సమ్మతించాడు.

అయినా, ఉధృతమైన గంగా జల ప్రవాహాన్ని తట్టుకునే శక్తి భూమికి లేదు. ఆ వేగాన్ని తట్టుకోగల శక్తి ఒక్క శివుడికే ఉందని గ్రహించిన భగీరథుడు–అందుకోసం శివుణ్ణి ప్రార్థించాడు. అతని ప్రార్థనను శివుడు మన్నించాడు. గంగ శివుడి తల మీదికి దిగి వచ్చింది.






శివుడి తల నుంచి భూమి మీదికి దిగిన గంగ భగీరథుడు ముందు దారి తీయగా, నేల నాలుగు చెరగులా ప్రవహించి భూమి సస్యశ్యామలం కావడానికి దోహదం చేసింది.

భగీరథుడు గంగా ప్రవాహాన్ని పాతాళానికి నడిపించాడు. కపిలుడి ఆశ్రమంలోని భస్మరాసులు గంగా జలంలో మునిగాయి. వెంటనే ఆ భస్మరాసుల నుంచి అరవైవేలమంది సగరరాకుమారులూ ప్రాణాలతో లేచి వచ్చారు. భగీరథుడి ప్రయత్నం ఫలించింది!





మన దేశంలో గంగానది అతి పవిత్రమైనదిగా సుప్రసిద్ధమయింది. గోముఖంలో రూపొంది, గంగోత్రి నుంచి ఆవిర్భవించి, గంగానది పురాతన పవిత్రక్షేత్రంగా పేరు గాంచిన, ఋషికేశం నుంచి మైదానాలగుండా ప్రవహిస్తున్నది.

గంగానది తీరాలలోని అనేక పుణ్యక్షేత్రాలలో—హరిద్వారం, వారణాసి చాలా ముఖ్యమైనవి. ఈ రెండు క్షేత్రాలూ చాలా పురాతనమైనవి. యుగయుగాలుగా భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నవి.






గంగాతీరంలో వెలసిన మరొక ముఖ్య నగరం కలకత్తా. ఈ నగర ప్రాంతంలో దీనిని హుగ్లీనది అని పిలుస్తారు. కలకత్తా నుంచి నది పలుపాయలుగా చీలి, బెంగాల్ పులులకు నిలయమైన సుందర్‌బాన్స్ అనే అడవులగుండా ప్రవహిస్తూ సముద్రంలో కలుస్తున్నది.



# నిజమైన వైద్యుడు

భీమేశ్వరు డనే రాజుకు, హఠాత్తుగా ఒక వింత వ్యాధి సోకింది. దాని ఫలితంగా, ఆయన శరీరం నిండా వికృతంగా మచ్చలు ఏర్పడినై. ఆస్థానవైద్యులు ఎన్నో రకాల చికిత్సలు చేశారుగాని, ఏమాత్రం ఫలితం కలగలేదు.

రాజధానీనగరంలో వుంటున్న సీనయ్య అనే వైద్యుడికి, యీ సంగతి తెలిసింది. రాజుకు వచ్చిన వ్యాధి చాలా అరుదైనది. వంశపారంపర్యంగా వైద్యవృత్తి సీనయ్య కుటుంబంలో వస్తున్నది. సీనయ్య, తన తండ్రి నుంచి అలాంటి వ్యాధికి చికిత్స తెలుసుకున్నాడు.

సీనయ్య చికిత్సకు అవసరం అయిన మందులు తయారు చేసి, ఒకనాడు రాజ దర్శనానికి వెళ్ళాడు.

ఆస్థానవైద్యులు అతణ్ణి చాలా ప్రశ్న లడిగి, అతడిచ్చిన జవాబులు విని, అతడు వైద్యశాస్త్రంలో చాలా ప్రావీణ్యం సంపాయించినవాడని గ్రహించారు.

దానితో వాళ్ళ కొక భయం పట్టు కున్నది. ఒకవేళ సీనయ్య యిచ్చిన మందు ద్వారా రాజుకు వ్యాధి నయమైతే, తామందరూ ఆయన దృష్టిలో అసమర్థు లవుతారు. ఆస్థానంలో తమ ఉద్యోగాలకు ఉద్వాసన జరుగుతుంది.

ఇలా ఆలోచించి ఆస్థాన వైద్యులు సీనయ్యతో, "మేమంతా బాల్యప్రాయం లోనే గురుకులాల్లో చేరి, క్షుణ్ణంగా వైద్య శాస్త్రం అభ్యసించినవాళ్ళం. అలాంటి మా చికిత్సకు లొంగని రాజుగారి వ్యాధి, నీ చికిత్సకు లొంగుతుందనుకోవడం ఒట్టి భ్రమ. పైగా, నీ మందులు రాజుగారి వ్యాధి కుదుర్చకపోగా, వికటించే ప్రమాదం వున్నది. అందుకు మేము బాధ్యులం కావలసివస్తుంది. కనక, రాజదర్శనం

పెంటకోట సోమినాయుడు



అంటూ మరి రాకు,'' అన్నారు చిరాకు పడుతూ.

సీనయ్య చేసేదిలేక ఇంటికి తిరిగి వెళ్ళాడు. అయితే, ఆస్థానవైద్యులు బుద్ధి మార్చుకుంటారేమో అని, అతడు నాలు గైదు రోజుల కొకసారి రాజప్రాసాదానికి వెళుతూండేవాడు. వైద్యులు మాత్రం మరింతగా కసిరి అతణ్ణి వెళ్ళగొడుతూండే వాళ్ళు.

ఇలా ఒకసారి అతడు రాజప్రాసాదం నుంచి తిరిగి వస్తూండగా, ఒక ధర్మ సత్రం అరుగు మీద కూర్చుని వున్న రోగి అతడి దృష్టిని ఆకర్షించాడు. ఆ రోగి శరీరం నిండా వికృతంగా మచ్చలున్నవి. అది రాజును పట్టి పీడిస్తున్న వ్యాధి లాంటిదే.

సీనయ్య ఆ రోగికి చికిత్స ప్రారంభించి, నెల తిరక్కుండానే అతణ్ణి సంపూర్ణా రోగ్యవంతుణ్ణి చేశాడు.

రాజు ఒకనాటి సాయంకాలం, ఇద్దరు అంగరక్షకులు వెంట రాగా ఉద్యానానికి పోతూ, సత్రం అరుగు దిగి తనకు నమస్కరించిన పాత రోగిని చూసి, ఆశ్చర్యపోయి, అంగరక్షకులతో, ''శరీర మంతా మచ్చలతో, ఇతడు అరుగు మీద ముడుచుకుని పడుకుని వుండడం లోగడ చాలాసార్లు చూశాను. ఇంతలో యితడెలా ఆరోగ్యవంతుడయాడు! పిలుచుకు రండి,'' అన్నాడు.

అంగరక్షకులు పోయి అతణ్ణి, రాజు దగ్గిరకు తీసుకువచ్చారు. రాజు అడిగిన మీదట, అతడు తనకు చికిత్స చేసిన సీనయ్యను గురించిన వివరాలన్నీ, చెప్పాడు.

రాజు ఆ రాత్రి మారువేషంతో, సీనయ్యను చూడబోయాడు. సీనయ్య, ఆయనను పరీక్షించి చికిత్స ప్రారంభిం చాడు. ఇరవై రోజుల్లోనే రాజు ఆరోగ్య వంతుడయాడు. ఆయన సీనయ్యకు కృతజ్ఞత చెప్పుకుని, బయలుదేరబోతూం డగా, సీనయ్య ఆయనతో, ''ఈ వ్యాధి

చాలా అరుదైనది. దురదృష్టం కొద్దీ లక్ష మందిలో, ఏ ఇద్దరు, ముగ్గురో దీనివాత బడతారు. అలాంటివాళ్ళకు చికిత్స చేసి, ఆరోగ్యవంతుల్ని చేశాను, కాని, ఈ దేశపు మహారాజుకు చికిత్స చేసే మార్గం కనబడడం లేదు," అన్నాడు.

"అదెంతపని! వెళ్ళి, రాజదర్శనం చేసుకుని, ఆయనకు వచ్చిన పని చెప్పు," అన్నాడు రాజు.

అప్పుడు సీనయ్య, ఆస్థానవైద్యులు తనకు రాజదర్శనం కాకుండా ఎలా అడ్డు పడుతున్నదీ చెప్పాడు. దానితో రాజుకు ఆస్థానవైద్యుల కపటబుద్ధి తెలిసి పోయింది. వాళ్ళకు తన ఆరోగ్యంకన్న, తమ పదవులు ముఖ్యమన్నమాట! వాళ్ళు కుదర్చలేని వ్యాధి సీనయ్య కుదిర్చితే, అప్పుడు అతడు తనకు ప్రధానవైద్యు డవుతాడు. ఇది సహించలేకే వాళ్ళు, సీనయ్యకు అడ్డు తగిలారు!

రాజు, సీనయ్యకు ఆస్థాన ప్రధాన వైద్యుడి పదవి యివ్వాలని నిర్ణయించు కుని, అతడితో, "సీనయ్యా, నేను మారు వేషంలో నీ దగ్గిర చికిత్స చేయించు కుంటున్న, యీ దేశపు రాజును," అంటూ మారువేషం తీసివేసి, "రేపు ఉదయం రాజోద్యోగులు నిన్ను సకలలాంఛనాలతో, రాజప్రాసాదానికి తీసుకువస్తారు. అప్పుడు నిన్ను ఘనంగా సన్మానించడమేగాక, ఆస్థానంలో ప్రధాన వైద్యుడి పదవి యిస్తాను. ఆ తర్వాత నువ్వు, నగరంలో



మారుమూల యీ పాతకాలపు భవంతిలో నివసించవలసిన అవసరం వుండదు.'' అన్నాడు.

సీనయ్య, రాజుకు వినయంగా నమస్కరించి, ''మహారాజా, తమరు యిస్తానన్న, ఆ పదవి తిరస్కరిస్తున్నందుకు క్షమించండి. నాకు, యీ పాతకాలపు భవంతిలో వుండడంలోనే, తృప్తి, సుఖం వున్నది,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ, ''నేనిచ్చే పదవీ, సంపదలూ—నీకు తృప్తి, సుఖం కలిగించలేవా?'' అని అడిగాడు.

''అవును, మహారాజా! ఒకసారి నేను తమ ఆస్థానంలో కుదురుకున్నాక, తమకూ, రాజకుటుంబీకులకూ తప్ప, యితరులకెవరికీ వైద్యం చేసే అవకాశం వుండదు. రోగగ్రస్తులైన పేద, సామాన్య ప్రజల మాటేమిటి? పదవీ, ధనవ్యామోహాలకు దాసుడనై, నా వైద్యవిద్యను కొద్ది మందికోసం పరిమితం చెయ్యలేను,'' అన్నాడు సీనయ్య.

సీనయ్య మాటల్లో రాజుకు ఎంతో సత్యం కనబడింది. ఆయన కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, ''సీనయ్యా, నువ్వు నిజమైన వైద్యుడివి! నా రాజ్య పౌరుడివైనందుకు ఎంతో గర్వపడుతున్నాను. నువ్వు మరింతగా సామాన్య ప్రజలకు వైద్య సహాయం చేసేందుకు వీలుకలిగించదలిచాను. ప్రతి నెలా కోశాగారం నుంచి యింత మొత్తం అంటూ, నీకు డబ్బు పంపుతాను. దానితో నువ్వు, అవసరం అనుకున్నచోట ధర్మవైద్యశాలలు నిర్మించి, రోగులకు సాయపడు. ఇది, నీకు యిష్టమేనా?'' అని అడిగాడు.

''మహారాజా, యింతకన్న నాకు కావలసినదేమీలేదు. కోరిక వున్నా, నాకు స్వయంగా ధర్మ వైద్యశాలలు నిర్మించే ఆర్థిక స్థోమతులేదు. మీ సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి,'' అన్నాడు సీనయ్య రాజుకు నమస్కరిస్తూ.

రాజు సంతోషంగా తన ప్రాసాదానికి తిరిగి వెళ్ళాడు.





# ధర్మదేవత

కుండలినీ దేశపురాజు సత్యానందుడు గొప్ప ధర్మదీక్షాపరుడు. ధర్మం కోసం ప్రాణాలనైనా పణం పెట్టగల త్యాగమూర్తి. ధర్మాచరణలో ఆశ్రితపక్షపాతం, బంధుప్రీతికి తావిచ్చేవాడు కాదు. ఆయన కులదేవత ధర్మదేవత. నిత్యమూ ఆమెను అర్చించకుండా ఏ పనీ చేసేవాడు కాదు.

సత్యానందుడికి, శ్రవణానందు డనే కొడుకున్నాడు. తనకు వృద్ధాప్యం సమీపించడంతో ఆయన కొడుక్కు పట్టాభిషేకం చేయదలిచాడు.

శ్రవణానందుడు పట్టాభిషిక్తుడైన కొద్ది మాసాలకు, సత్యానందుడి ఆరోగ్య పరిస్థితి విషమించింది. ఆ స్థితిలో, ఆయన కొడుకును చేరబిలిచి, ''నాయనా, ధర్మం కోసం ప్రాణాలను సైతం లెక్క చెయ్యని ధర్మజ్ఞులు మన పూర్వులు. వారు నడిచిన బాటనే, నువ్వూ నడవాలి. ధర్మాన్ని ఆచరించడంలో, నీకేదైనా గడ్డు సమస్య ఎదురైతే, మన రాజ్యానికి దక్షిణ దిశగా వున్న ధర్మదేవత ఆలయాన్ని దర్శించు. నీకు తప్పక సమస్యా పరిష్కారం లభిస్తుంది,'' అని చెప్పాడు.

తండ్రి మరణించాక శ్రవణానందుడు, ఆయన లాగే న్యాయమార్గాన రాజ్యపాలన చేస్తూ, ధర్మమూర్తిగా గొప్ప కీర్తి గడించాడు. ఇలా కొన్నేళ్ళు గడిచాక శ్రవణానందుడికి ధర్మపరమైన ఒక సమస్య ఎదురయింది.

శ్రవణానందుడి కుమార్తె మాలతి, ఒక చిన్న సామంతరాజు కుమారుణ్ణి ప్రేమించింది. ఆయన కుమార్తె కోర్కెను కాదనలేక పోయాడు. కాని, వంశాచారం ప్రకారం మాలతి మరొక దేశపు రాజకుమారుణ్ణే వివాహమాడాలి. అలా కానప్పుడు, తాను వంశాచారాన్ని అతి

ఎస్. శివనాగేశ్వరరావు



క్రమించినవాడవుతాడు. వంశాచారాన్ని వదలకపోతే, కుమార్తె మనసును నొప్పించినవాడవుతాడు.

ఈ సమస్యను ఎలా పరిష్కరించాలా అని ఆలోచిస్తున్న శ్రవణానందుడికి, తండ్రి మాటలు జ్ఞప్తికి వచ్చినై. అతడు వెంటనే ధర్మదేవత ఆలయానికి వెళ్ళి, విగ్రహానికి నమస్కరించి తన సమస్యను వివరించాడు.

మరుక్షణం ధర్మదేవత విగ్రహం వింత తేజస్సుతో వెలిగింది. ఆ తరవాత విగ్రహం నుంచి, "శ్రవణా! నువ్వు ముందు తండ్రివా లేక రాజువా?" అన్న ప్రశ్న వినవచ్చింది.

"తల్లీ, పట్టాభిషేకం నాటికి నేను వివాహితుణ్ణి. అప్పటికి మాలతి చిన్న పసికందు," అన్నాడు శ్రవణానందుడు.

"అయితే, మాలతి పట్ల నువ్వు రాజుగా కాక, తండ్రిగానే నీ బాధ్యత నిర్వహించాలి. అదే ధర్మం!" అన్నది ధర్మదేవత.

ఆ వెంటనే విగ్రహంలోని వెలుగు అంతరించింది. శ్రవణానందుడు విగ్రహానికి మరొకసారి నమస్కరించి, తన భవనానికిపోయి, ఒక శుభముహూర్తాన మాలతికి సామంతరాజు కొడుకుతో వివాహం జరిపించాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే శ్రవణానందుడికి మరొక సమస్య ఎదురయింది. గురుకులంలో క్షాత్రవిద్యలు అభ్యసిస్తున్న, ఆయన కుమారుడు నాగానందుడి కారణంగా, ఈ సమస్య వచ్చిపడింది.

నాగానందుడు, మరొక సహాధ్యాయితో ఖడ్గయుద్ధ సాధన చేస్తూండగా, పొరబాటున అతడి ఖడ్గం తగిలి, ఆ సహాధ్యాయి కుడిచెయ్యి తెగిపోయింది. అతను విరాగుడనే బ్రాహ్మణుడి కుమారుడు.

విరాగుడు, రాజు శ్రవణానందుణ్ణి నిండు సభలో దర్శించి, "మహారాజా, ఖడ్గ విద్యలో తనను మించిపోగలడనే అసూయతో, నీ కుమారుడు నాగానందుడు, నా కుమారుడి కుడి చెయ్యి

ఖండించాడు. దెబ్బకు ప్రతీకారం దెబ్బ- అన్న మన శిక్షాస్మృతి ప్రకారం, మీ కుమారుడి కుడిచేతిని ఖండించి, ధర్మ మూర్తి అన్న కీర్తిని సార్థకం చేసుకోండి!'' అన్నాడు.

శ్రవణానందుడికి ఏం చేయాలో పాలు పోలేదు. ఆయన అప్పటికి సభను చాలించి, ధర్మదేవత ఆలయానికి వెళ్ళి, సమస్యను వివరించాడు.

ఆలయం అంతా వెలుగుతో నిండి పోయింది. ధర్మదేవత స్వరం గంభీరంగా, ''శ్రవణా! దెబ్బకు ప్రతీకారం దెబ్బ, అన్న మీ రాజ్య శిక్షాస్మృతికి కళంకం అంటకూడదు. నీ కొడుకు ఏ చేతితో విరూపుడి కొడుకు చేతిని నరికాడో— విరూపుడి కొడుకు కూడా అదే చేతితో, నీ కొడుకు చేతిని నరకాలి. అదే ధర్మం!'' అని పలికింది.

మర్నాటి సభలో శ్రవణానందుడు, విరాగుడితో, ధర్మదేవత అన్న మాటలు చెప్పి, ''నీ కుమారుడు కుడిచేతిని ఉపయోగించలేడు కనక, శిక్షాస్మృతి ప్రకారం నిందితుణ్ణి శిక్షించే అవకాశం లేదు,'' అన్నాడు.

శ్రవణానందుడి తీర్పును, సభలో వున్నవాళ్ళందరూ ఆమోదిస్తూ, కరతాళ ధ్వనులు చేయడంతో, విరాగుడు మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

కుండలినికి పొరుగురాజ్యమైన వైశాలినీ రాజు వసంతసేనుడు, శ్రవణానందుడి







బాల్యమిత్రుడు. ఆయన శ్రవణానందుణ్ణి చూడవచ్చాడు. ఒక రాత్రి విందు ముగిశాక, వసంతసేనుడు కాలక్షేపం కోసం శ్రవణానందుడితో చదరంగం ఆడాలనుకున్నాడు. అతిథి మాట కాదనలేక శ్రవణానందుడు అందుకు సిద్ధమయాడు.

''ఆటలో పందెం లేకపోతే పస వుండదు. ఏదైనా పందెం కాయి!'' అన్నాడు వసంతసేనుడు.

శ్రవణానందుడు తన ముంజేతి కంకణం తీసి పందెం కాశాడు. అది చూసి వసంతసేనుడు నవ్వి, ''మనం రాజులమై వుండి, సామాన్యుల లాగా యిలాంటి చిన్న పందెం కాసుకోవడం ఏం భావ్యం! నేను, నా రాజ్యాన్ని పందెంగా కాస్తున్నాను; నువ్వూ అదే చెయ్యి,'' అని ప్రోత్సహించాడు.

శ్రవణానందుడు సరేనన్నాడు. ఎత్తుకు పై ఎత్తులు వేస్తూ, ఆటలో చాలాసేపు ప్రత్యర్థిని ఓడించేందుకు యిద్దరూ శతవిధాల ప్రయత్నించారు. దురదృష్ట వశాత్తూ శ్రవణానందుడు ఓడిపోయాడు. అన్న మాట ప్రకారం ఆయన తన రాజ్యాన్ని వసంతసేనుడికి యివ్వజూపాడు.

అందుకు వసంతసేనుడు సమ్మతించక, ''నేను ఆట రక్తికట్టేందుకు అలా అన్నానేగాని, నీ రాజ్యం నాకెందుకు? మనం మంచి మిత్రులం. నీ రాజ్యాన్ని స్వీకరించి మిత్రద్రోహం చెయ్యలేను!'' అన్నాడు.

ఈ మాటలకు శ్రవణానందుడు అభ్యంతరం చెబుతూ, ''నీవు సరదాగా అన్నావేమో కాని, నేను మాత్రం నిజంగానే, నా రాజ్యాన్ని పందెం ఒడ్డాను. నేను ఆడినమాట తప్పను. రాజ్యం స్వీకరించు!'' అని వసంతసేనుణ్ణి బలవంతపరిచాడు.

అయినా, వసంతసేనుడు అందుకు ఒప్పుకోలేదు. చివరికి శ్రవణానందుడు సమస్య పరిష్కారానికి ధర్మదేవతను దర్శించాలనుకున్నాడు. ఇద్దరూ కలిసి

ఆమె ఆలయానికి వెళ్ళారు. శ్రవణా నందుడు తన సమస్య చెప్పుకుని, పరిష్కార మార్గం సూచించవలసిందిగా ధర్మదేవతను ప్రార్థించాడు.

ఈసారి ధర్మదేవత విగ్రహం వెలుగుతో ప్రకాశించలేదు. ఆమె హీనస్వరంతో, "శ్రవణా! రాజ్యం ధారాదత్తం చేయ డానికి, నీవెవరు? పుచ్చుకోవడానికి, వసంతసేనుడెవరు? రాజ్యం ప్రజలది; రాజు కేవలం పరిపాలకుడు మాత్రమే. దేవాలయానికి ధర్మకర్త లాంటివాడు!" అన్నది.

ధర్మదేవత సమాధానం విన్న వసంత సేనుడు, ఆమెకు భక్తితో సాగిలపడి నమస్కరించి అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

శ్రవణానందుడు కూడా వెళ్ళబోతూం డగా, ధర్మదేవత విగ్రహం నుంచి, "శ్రవణా! రాజ్యాన్ని పణంగా పెట్టే ముందు నువ్వు ప్రజలను గురించి ఏ మాత్రం ఆలోచించలేదు. ధర్మాన్ని అతిక్రమించావు. నువ్వు జూదరివి! నువ్వు మరి రాజుగా వుండతగవు. నీ వున్న రాజ్యంలో, నేనుండను," అన్న మాటలు వినిపించినై.

ఆ మరుక్షణం ధర్మదేవత విగ్రహం తల ఊడి కిందపడింది.

శ్రవణానందుడు పుట్టెడు దిగులుతో తన భవనానికి తిరిగి వచ్చి, ఒక శుభ ముహూర్తాన కొడుకు నాగానందుడికి పట్టాభిషేకం చేసి, "నాయనా, ఈ రాజ్యం ప్రజలది; నీవు కేవలం పరిపాలకుడివి మాత్రమే. ఈ మాట ఎన్నడూ మరవకు. ధర్మదేవతను, నీ హృదయంలో నే అధిష్ఠించుకో," అని నీతిబోధ చేశాడు.

ఆ మర్నాటి ఉదయం అతడు ధర్మ దేవత ఆలయానికి వెళ్ళాడు. ధర్మదేవత విగ్రహం తల యథాస్థానంలోనే వున్నది. విగ్రహం పూర్వం కంటె మరింతగా ప్రకా శిస్తున్నది. ఇది చూసిన శ్రవణానందుడు ఎంతో తృప్తిగా విగ్రహం ముందు మోకరిల్లి నమస్కరించాడు.





# కోడలి భయం

రవిరాజుతో వివాహం జరగగానే, కనకం అత్తవారింటికి కాపరానికి వచ్చింది. ఆ రోజే మామ చలపతి ఆమెతో, ''కనకం, మీ అత్తది చాలా కోపిష్టి స్వభావం. విసుక్కోకుండా ఆవిడ చెప్పినట్టు నడుచుకో,'' అన్నాడు.

అలాగే అన్నట్టు మౌనంగా తల వూపింది కనకం.

ఆమె ఓపిగ్గా ఇంటిపనులు చేస్తున్న కొద్దీ మరెన్నో పనులు పురమాయిస్తూండేది, అత్త సూరమ్మ.

కనకం కాపరానికి వచ్చిన మూడో రోజున, ఆమె నూతి దగ్గిర నుంచి బిందెతో మంచినీళ్ళు తేవడం కాస్త ఆలస్యం అయింది.

. అత్త సూరమ్మ చిరచిరలాడుతూ గడప దగ్గిరకు వచ్చి, ''కనకం! ఇంత ఆలస్యంగా నీళ్ళు తెస్తే ఎలా? మరి, గుడ్డలన్నీ ఎప్పుడుతుకుతావు?'' అంటూ గట్టిగా కేకలు వేసింది.

ఆ కేకలకు భయపడి వణుకుతూ కనకం, నీళ్ళబిందెను జారవిడిచింది. బిందె బాగా సొట్టపడింది.

సూరమ్మ బిందెను పైకెత్తి చూస్తూ, ''నికేపంలాటి బిందె సొట్ట పడిపోయింది గదే!'' అంటూ చీవాట్లు పెట్టింది.

కనకం మాట్టాడకుండా అలా వణుకుతూ వూరుకున్నది.

పెరటివైపు గదిలో నుంచి యిది చూసిన మామ చలపతి అక్కడికి వచ్చి, ''ఇక ఊరుకో. పిల్ల భయపడి పోతున్నది.'' అని భార్యను శాంత పరిచాడు. .

మధ్యాహ్నం భోజనాల సమయంలో నేతిగిన్నె పట్టుకుని వడ్డన చేస్తున్నది, కనకం.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

సూరమ్మ కోడలి కేసి చురచుర చూస్తూ, "వెచ్చబెట్టకుండా నెయ్యి వడ్డించ వద్దని చెప్పానా? వట్టి మంద మతి!" అని గట్టిగా గద్దించింది.

కనకం భయంతో వణుకుతూ, నేతి గిన్నెను కింద పడవేసింది.

"కమ్మని గిన్నెడు నేతిని నేలపాలు చేశావు గదే!" అని కేకలు పెట్టసాగింది సూరమ్మ.

వణుకుతున్న కోడల్ని చూసి జాలి పడి, చలపతి మరొకసారి భార్యను శాంత పరిచాడు.



ఆ సాయంకాలం కనకం నూతిలోంచి నీళ్ళు తోడుతూంటే, సూరమ్మ రుసరుస లాడుతూ అక్కడికి వచ్చి, "పొయ్యి మీద అన్నం మాడిపోతున్నది. అది చూడ కుండా నూతి దగ్గిరకు వచ్చావు. నీ బుర్రలో కాస్తయినా బుద్ధంటూ వున్నదా!" అంటూ అరవసాగింది.

కనకం కంగారుపడిపోతూ బొక్కెనను నూతిలోకి జారవిడిచింది. ఆమె భర్త రవిరాజు గాలంతెచ్చి బొక్కెనను బయిటికి తీశాడు.

మర్నాటి ఉదయం కనకం రెండు గేదెల పాలు పితికి, పాలచెంబుతో వస్తూ వుంటే, సూరమ్మ ఆమెకు ఎదురుపోయి, కొరకొరలాడుతూ, "పశువులకు గాబులో కుడితి నీళ్ళు పొయ్యమంటే, పొయ్య లేదేం?" అంటూ కేకలు పెట్టింది.

ఆ కేకలు వింటూనే కనకం ఎంత గానో భయపడిపోయి, పాలచెంబును నేలజార్చింది.

అప్పుడే వీధిలోంచి ఇంట్లోకి వస్తున్న చలపతి యిది చూసి, "కనకం! నిన్న బిందె సొట్టపోగొట్టావు. నేతి గిన్నె కింద పడేశావు. నూతిలో బొక్కెన జార విడి చావు. ఉదయాన్నే పాలు వలకపోశావు. ఇలా అయితే ఎలా?" అని అడిగాడు.

కనకం యింకా భయపడుతూనే తల వంచుకుని, "మామయ్యా. ఎవరైనా నన్ను కసిరితే భయంవేసి వణుకు పుడు

తుంది, ఏం చెయ్యను!'' అన్నది దీనంగా.

వెంటనే చలపతి భార్యతో, ''నువ్వు కోడల్ని కసిరినప్పుడల్లా, ఏదో ఒకటి పాడవుతున్నది. నువ్వు కోపం తగ్గించుకో,'' అన్నాడు.

సూరమ్మ కోపంగా మూతి ముడుచుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

మర్నాడు ఇంటికి వచ్చిన పొరుగింటావిడ కాంతమ్మతో మాట్లాడుతూ సూరమ్మ, లోపలి గదిలో వున్న కనకాన్ని మంచినీళ్ళు పట్టుకురమ్మని కేక వేసింది.

కనకం నీళ్ళు తేవడం కొంచెం ఆలస్యం అయ్యేసరికి, ''చెప్పిన వెంటనే తేవద్దులే!'' అని కసిరినట్టు అడిగింది సూరమ్మ.

కనకం భయంతో వణకసాగేసరికి, చేతిలోని నీళ్ళచెంబు కింద పడిపోయింది.

సూరమ్మ గట్టిగా విసుక్కుంటూ కాంతమ్మతో, ''ఇదమ్మా, మా కోడలి వరస! ఏదైనా మాట అంటే చాలు; భయం అట. చేతిలోని వస్తువు వది లేస్తుంది,'' అన్నది.

''అవును పాపం. కొత్తగా కాపరానికి వచ్చిన కొందరు ఆడపిల్లలు అలాగే భయపడిపోతూంటారు. అందువల్ల యింట్లో వస్తువుల నష్టం తప్పనిసరి అవుతుంది. దానికి ఒకటే మందు; మనం కోపాన్ని కాస్త అదుపులో వుంచుకుంటే సరి,'' అన్నది కాంతమ్మ.

ఆనాటి నుంచీ సూరమ్మ తన కోపిష్ఠితనాన్ని వదులుకుని, కోడలితో తూచినట్టు నెమ్మదిగా మాట్లాడడం అలవాటు చేసుకున్నది. కోడలివల్ల తన భార్యలో వచ్చిన మంచి మార్పుకు చలపతి ఎంతో సంతోషించాడు.

అయితే, కనకం చాలా తెలివైనపిల్ల. అత్తగారి కోపిష్ఠిస్వభావాన్ని మార్చడానికి, ఆమె కోపగించుకున్నప్పుడల్లా, భయంతో వణికిపోతున్నట్టు నటించిన సంగతి, ఆమె భర్త రవిరాజు ఒక్కడికి మాత్రమే తెలుసు.





# శివపురాణం

శివపార్వతుల వివాహం వైభవంగా జరిగిపోయింది. ఈ లోపల దేవతలకు తారకాసురుడు పెట్టే కష్టాలు అంత కంతకూ మితిమీరి పోయాయి. వాళ్ళు బ్రహ్మ వద్దకు వెళ్ళి, "ఓ బ్రహ్మదేవుడా, నీ వరాల మూలంగా మేము చెప్పలేని నరక బాధలు పడుతున్నాము. తారకాసురుడు చస్తేగాని మాకు సుఖం లేదు," అని మొత్తుకున్నారు.

బ్రహ్మ వారితో, "నేను తారకుడికి అసాధారణమైన వరాలు ఇచ్చిన మాట నిజమే. కాని వరాలు ఇవ్వక ఎలా తప్పుతుంది? దుర్మార్గులైనా, సన్మార్గులైనా కూడా వరాలు ఇచ్చి తీరాలి. దుర్మార్గులనే ఉద్దేశంతో వరాలు ఇవ్వటం మానితే వాళ్ళు తపస్సు మానరు. వారి తపస్సు నుంచి పుట్టిన అగ్ని లోకాలను దహిస్తుంది. లోకాలను కాపాడటానికి వరాలిస్తున్నాను. ఆ వరాల సహాయంతో వాళ్ళు లోకాలను పీడిస్తున్నారు. ఆ కారణంగా వారిని చంపే అవసరం కలుగుతున్నది. మనం విష్ణువు వద్దకు వెళ్ళి కష్టాలు చెప్పుకుందాము," అన్నాడు.

అందరూ కలిసి విష్ణువు వద్దకు వెళ్ళి, తారకుడు పెట్టే బాధలను గురించి చెప్పుకున్నారు. విష్ణువు వారితో, "పార్వతీ పరమేశ్వరులు వివాహం చేసుకుని, దాంపత్య జీవితం గడుపుతున్నారు. వారికి కుమారుడు కలగగానే మీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

7. కుమారసంభవం

''శివపార్వతుల దాంపత్యం ఆరంభమై చాలా కాలమయింది. ఇంకా వారికి కొడుకు పుట్టలేదు. నువు వచ్చి శివుణ్ణి చూసి మా గోడు ఆయనకు చెప్పాలని మా ప్రార్థన,'' అన్నారు దేవతలు విష్ణువుతో.

విష్ణువు బ్రహ్మాది దేవతలను వెంట బెట్టుకుని కైలాసానికి వచ్చాడు. శివుడి భవనం చుట్టూ నందీశ్వరుడు మొదలైన వాళ్ళు కాపలా ఉన్నారు.

విష్ణువు నందీశ్వరుడితో, ''మేము శివుణ్ణి చూడవచ్చాము. మమ్మల్ని లోపలికి వెళ్ళనీ,'' అన్నాడు.

''శివపార్వతులు లోపల ఏకాంతంలో ఉన్నారు. ఎవరినీ లోపలికి రానీయవద్దని శివుడి ఆజ్ఞ. ఆయన ఆజ్ఞ పాలించటం మా విధి. ఈ కారణంవల్ల, మమ్మల్ని మన్నించాలి,'' అన్నాడు నందీశ్వరుడు విష్ణువుతో.

వాళ్ళంతా వచ్చిన పనికి విఘ్నం కలిగింది. దేవతలందరూ ఏమిచేయడమా అని విచారించసాగారు. అప్పుడు విష్ణువు దేవతలతో, ''పార్థివలింగాన్ని తయారు చేసి, శివ పంచాక్షరి జపిస్తూ పూజిస్తే, శివుడు ప్రసన్నుడై దర్శన మిస్తాడు,'' అంటూ సలహా ఇచ్చాడు.

విష్ణువు చెప్పిన విధంగా దేవతలు అప్పటికప్పుడే మట్టితో పార్థివ లింగాన్ని తయారు చేసి, పంచాక్షరీయుక్తంగా భక్తితో షోడశోపచార పూజలు చేసి,



"హరహరమహాదేవ శంభో!" అని గట్టిగా అరిచారు.

స్తోత్ర ప్రియుడైన శివుడు ఇది విని, వెంటనే భవనంలో నుంచి ద్వారం వద్దకు వచ్చి, "దేవతలారా, నన్ను ఎందుకు ప్రార్థిస్తున్నారు?" అని అడిగాడు.

బ్రహ్మ మొదలైనవాళ్ళు ఆయనకు నమస్కరించి, "ఈశ్వరా, తారకుడి దుశ్చర్యలు రోజురోజుకూ మితిమీరుతున్నవి. వాడు యజ్ఞయాగాదులు జరగకుండా ఋషులను నానా యిక్కట్ల పాలు చేస్తున్నాడు. వాణ్ణి చంపడానికి, నీ అంశన ఒక కొడుకును సృష్టించు," అన్నారు.

బ్రహ్మ, యితర దేవతలు కోరిన విధంగా శివుడు తన అంశతో, మార్గశిర షష్ఠి, ధనిష్ఠానక్షత్ర మందు వృశ్చిక లగ్నాన ఒక పిల్లవాణ్ణి సృష్టించాడు. ఆ పిల్లవాడికి అందమైన ఆరు ముఖాలూ, పన్నెండు చేతులూ, వజ్ర శరీరమూ ఉన్నాయి.

వాయుదేవుడు, ఆ పిల్లవాణ్ణి ఎత్తుకుపోయి గంగాతీరంలోని రెల్లుదుబ్బులలో వదిలాడు. అప్పుడు ముని భార్యలు ఆరుగురు గంగాతీరానికి వచ్చి ఆరు ముఖాల బిడ్డను చూశారు. వెంటనే ఆరుగురికీ పాలు చేపాయి. ఆ పిల్లవాడు ఆరు ముఖాలతో ఆరుగురి వద్దా పాలు తాగాడు.





బ్రహ్మదేవుడే స్వయంగా వచ్చి ఆ పిల్లవాడికి జాతకర్మా, నామకరణమూ చేశాడు. ఆ పిల్లవాడే కుమారస్వామి. అతనికి షణ్ముఖుడనీ, స్కందుడనీ, గుహుడనీ అనేక పేర్లు వచ్చాయి.

ముని పత్నులు అతనితో, ''నాయనా, మమ్మల్ని మా భర్తలు వెళ్ళగొట్టారు. మాకేమిటి దిక్కు ?'' అని అడిగారు.

''నేను మీ కొడుకునే, మీరు నాకు తల్లులు. అందుచేత నా వెంటనే ఉండండి,'' అన్నాడు కుమారస్వామి.

కుమారస్వామి దినదినప్రవర్ధమానుడై, కొండల మీద తిరిగి ఆడుకుంటూ, సింహాలనూ, పులులనూ పట్టుకుంటూ వాటి మీద ఎక్కి సవారీ చేస్తూ వచ్చాడు. అతనికి శివుడి విల్లు దొరికింది. దానితో అతను బాణాలు వేసి, క్రౌంచపర్వత శిఖరాన్ని ఖండించాడు.

అది చూసి ఆ పర్వతం మీద ఉండే రాక్షసులు కుమారస్వామి మీదికి యుద్ధానికి వచ్చారు. కుమారస్వామి వారినందరినీ చంపేశాడు.

ఈ లోపల శివపార్వతులకు ఇరవై ఒక్కమంది సంతానం కలిగారు. వారందరూ వేరువేరు గణాలకు మూలపురుషులై గణపతులయారు.

శివుడి ఆజ్ఞ చొప్పున నందీశ్వరుడు వెళ్ళి, బ్రహ్మ విష్ణు ఇంద్రాది దేవతలనూ, గంగాతీరం నుంచి కుమారస్వామినీ కైలాసానికి పిలుచుకువచ్చాడు. కుమారస్వామి తన తల్లులైన ఆరుగురు కృత్తికలనూ వెంటబెట్టుకుని, పుష్పక విమానంలో వచ్చాడు.

పార్వతీ పరమేశ్వరులు కుమారస్వామికి ఎదురు వెళ్ళి, కౌగలించుకుని తీసుకువచ్చి, సభలో తమ సమీపాన కూర్చోబెట్టుకున్నారు.

అప్పుడు బ్రహ్మ కుమారస్వామి సమీపంలో నిలబడి, ''పార్వతీ పరమేశ్వరులారా, ఈ కుమారుడు, ఇవేళ కైలాసానికి వచ్చాడు. రేపు అతన్ని దేవసేనలకు

సేనాపతిగా అభిషేకించటం బాగుంటుంది," అన్నాడు.

ఈ మాటకు సభలో అందరూ సంతోషించారు. పార్వతీ పరమేశ్వరులు కుమారస్వామికి ఉపనయనం చేశారు. అనంతరం బ్రహ్మ పురోహితుడుగా ఉండి, కుమారస్వామిని దేవసేనకు సేనాపతిగా అభిషేకం జరిపాడు.

పార్వతీ పరమేశ్వరులు కుమారస్వామితో, "నాయనా, నువు ఇప్పుడు దేవతల సేనాపతివి. నువు దేవేంద్రుడికి అండగా ఉండి, మూడు లోకాలనూ ఆపదల నుంచి కాపాడాలి. దుర్మార్గులనూ, పాపాత్ములనూ సంహరించాలి. గొప్పవాడివి అనిపించుకుని గౌరవం పొందాలి," అన్నారు.

స్వర్గంలో విశ్వకర్మ చేత కుమారస్వామికి తగిన భవనాలు కట్టించారు.

పార్వతీ పరమేశ్వరులు కుమారుడితో, "నాయనా, నీ కోసం భవనాలు సిద్ధంగా ఉన్నాయి. నువు వెళ్ళి వాటిలో నివాసం ఏర్పరచుకో," అన్నారు.

పార్వతీదేవి కుమారుడికి దేవీగణాలను కూడా ఇచ్చింది. దేవతలు కుమారస్వామికి అనేకమైన వరాలూ, అస్త్ర, శస్త్ర ఆయుధాలూ ఇచ్చి, తారకుణ్ణి సంహరించమని ఆశీర్వదించారు.



తరవాత కుమారస్వామి పార్వతీ పరమేశ్వరులకూ, బ్రహ్మ, విష్ణు ఇంద్రాది దేవతలకూ మొక్కి, తన గణాలతో, "మీరు తారకుడి పట్టణాన్ని ముట్టడించటానికి సన్నాహాలు చెయ్యండి," అని చెప్పి స్వర్గపట్టణానికి వెళ్ళి, తన కోసం నిర్మించిన భవనాలలో ప్రవేశించాడు.

అక్కడ శోణితపురంలో తారకుడికి వార్తలన్నీ అందాయి. శివుడి వీర్యాన పుట్టిన కుమారస్వామిని దేవతలు తమ సేనాపతిగా చేసుకుని, తనను చంపించటానికి సిద్ధంగా ఉన్నారు.

తారకుడు తన మంత్రులనూ, సేనానాయకులనూ రప్పించి, "మన నగరం



మీద దాడి జరగబోతున్నట్టు చారులవలన తెలిసింది. మీరు కూడా ఆ దాడిని ఎదుర్కొనటానికి తగిన ప్రయత్నాలు చెయ్యండి,'' అని చెప్పి పంపివేశాడు.

తరవాత, శివభక్తుడైన తారకుడు పార్థివ లింగాన్ని తయారుచేసి, పూజకు అవసరమైన పంచ బిల్వాలనూ, కొబ్బరికాయలనూ, పంచామృతాలనూ, పూలనూ, ఫలాలనూ, సుగంధాలనూ సిద్ధం చేసుకుని, షోడశోపచార పూజలు చేసి, అభిషేకాలు జరిపి, ధూప దీప నైవేద్యాలు పెట్టి, ''ఈశ్వరా, నిన్ను పూజించాను, పూజకు తగిన ఫలితం ప్రసాదించు,'' అని దణ్ణం పెట్టాడు.

అక్కడ స్వర్గంలో కుమారస్వామి, దేవతల గురువైన బృహస్పతి పెట్టిన ముహూర్తంలో రణభేరి వేయించి, దేవ, రుద్ర, వీరభద్ర, దేవీగణాలతో యుద్ధానికి బయలుదేరాడు.

కుమారస్వామి దేవేంద్రుడు మొదలైన వారితో శోణితపురాన్ని చేరి, నగరాన్ని ముట్టడించి, దాపుల్లో ఒక శిబిరం ఏర్పాటు చేయించాడు. అతను శిబిరం మధ్యలో దేవేంద్రుడు మొదలైన వారితో సహా కూర్చుని, ''యుద్ధానికి ముందు సంధి ప్రయత్నం చెయ్యటం ఉత్తమమని చెబుతారు. ముందు సంధి రాయబారం పంపుదాం. దీనికి మీరేమంటారు ?'' అని అడిగాడు.

దానికి దేవేంద్రాదులు సమ్మతించారు. అప్పుడు కుమారస్వామి, తన వక్షస్థలం నుంచి పుట్టిన విశాఖుణ్ణి చూసి, ''విశాఖా, నువు తారకుడి సభకు వెళ్ళి, నా మాటగా ఇలా చెప్పు. తారకుడి సమాధానం తెలుసుకుని తిరిగిరా !'' అంటూ విశాఖుడికి తన మాటలు చెప్పాడు.

విశాఖుడు వెళ్ళేసరికి తారకుడు సభ చేసి తన నగరం ముట్టడి గురించి ఆలోచనలు జరుపుతున్నాడు. అతను విశాఖుణ్ణి చూసి, ''నువు ఎవరు ? ఏం పని మీద వచ్చావు ?'' అని అడిగాడు.

విశాఖుడు అతనితో "తారకా, నువు, శివభక్తుడివి. శివపుత్రుడైన కుమారస్వామి నీ వద్దకు నన్ను రాయబారిగా పంపాడు," అన్నాడు.

తారకుడు సంతోషించి విశాఖుణ్ణి కూర్చోమని, "నాతో కుమారస్వామి ఏమి చెప్పమన్నాడు? నాకు దేవతలు విరోధులు గాని, కుమారస్వామి విరోధి కాడు," అన్నాడు.

"తారకా, నువు చాలా కాలంగా మూడు లోకాలూ ఏలావు. నీ పాలనలో లోకాలు ఏమాత్రం సుఖపడలేదు. ఇక నీవు అధికారాన్ని ఇంద్రుడి పరం చేసి, భోగవతీపురానికి వెళ్ళిపో. లేకపోతే కుమారస్వామి నిన్నూ, నీ వారినీ తప్పక చంపి, ఇంద్రుడికి నీ అధికారాన్ని ఇచ్చి వేస్తాడు. ఈ మాట నీతో చెప్పమని కుమారస్వామి నన్ను పంపాడు," అన్నాడు విశాఖుడు.

తారకుడు మండిపడి "నేను భయపడి రాజ్యం వదులుకోను. రేపు ఉదయం యుద్ధానికి వస్తున్నాను. సిద్ధంగా ఉండమను!" అని జవాబు చెప్పాడు.

మర్నాడు సూర్యోదయం వేళకు రెండు పక్షాల సేనలూ యుద్ధానికి సిద్ధమయాయి. ఉభయ పక్షాలవారూ ప్రాణాలకు తెగించి పోరాడారు. తారకుడి పక్షాన బాణాసురుడూ, ప్రలంబాసురుడూ, జంబాసురుడూ, అతిబలుడూ, శంభాసురుడూ, కుంభాసురుడూ మొదలైన వీరులున్నారు. కుమారస్వామి పక్షాన అతనితోపాటు వీరభద్రుడూ, అగ్నిహోత్రుడూ, ధర్ముడూ, సూర్యచంద్రులూ మొదలైనవారున్నారు.

యుద్ధం చాలా రోజులు జరిగింది, కాని తారకుడు ఓడే సూచనలు కనిపించలేదు. దేవతలకు నీరసం వచ్చేస్తున్నది. వాళ్ళ ధైర్యం పూర్తిగా అడుగంటిన సమయంలో కుమారస్వామి పాశుపతాస్త్రం ప్రయోగించాడు. అది తారకుడి సేనలపై కొన్ని వేల పిడుగులలాగా పడింది. రాక్షస సేనలు చెల్లా చెదరయాయి. పారిపోక నిలిచినవారంతా బూడిద అయిపోయారు.





# పరోపకారి

బస్రా పట్టణంలో అజీబ్ అనే యువ వర్తకుడు ఒకడు ఉండేవాడు. అతడు గొప్ప ధనికుడే కాకుండా, మంచి నిజాయితీ పరుడు కావడం వల్ల అందరూ అతన్ని గౌరవించేవారు. పైగా ఎవరైనా కష్టాలలో ఉంటే అజీబ్ వెంటనే ఆదుకునేవాడు. అందువల్ల, ఆ పట్టణ ప్రజలకు అతని పట్ల ఎనలేని ప్రేమాదరాలు ఉండేవి.

అజీబ్ పొరుగు ఇంట్లో సయ్యద్ అనే మరొక వర్తకుడు ఉండేవాడు. అజీబ్‌కు ఉన్న పేరు ప్రఖ్యాతులు చూసి సయ్యద్ అసూయ చెందాడు. అజీబ్ వ్యాపారం అభివృద్ధి చెందడం చూసి, సయ్యద్ ఓర్వలేక పోయాడు. అతడికి రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపట్టేదికాదు. మనోవేదనతో కొన్నాళ్లకు వాడు మంచం పట్టాడు.

ఒకనాడు సయ్యద్ భార్య, అజీబ్ దగ్గరికి వచ్చి, అతని సంపదలనూ, కీర్తి ప్రతిష్ఠలనూ చూసి, తన భర్త జబ్బుపడి కదలలేని స్థితిలో ఉన్నాడని చెప్పి, కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది.

అంతా విన్న అజీబ్, "నువ్వేమీ బాధ పడకు. నీ భర్త కోలుకునే మార్గం నేను చూస్తాను," అని ఓదార్చి పంపాడు.

ఆ రాత్రంతా అజీబ్ బాగా ఆలోచించాడు. "తన సంపదలు పొరుగింటివాడి అసూయకూ, అనారోగ్యానికీ కారణాలయ్యాయా? అటువంటి సంపదలు లేకపోతే మాత్రం ఏం?" అనుకుని వేకువ జామునే ఇల్లువదలి బయలుదేరాడు.

అజీబ్ ఒంటరిగా నడుస్తూ సాయంకాలానికి, ఒక పాడుపడిన బావి దగ్గరికి చేరాడు. దానిచుట్టూ పచ్చిక బయలు ఉన్నది. అజీబ్ బావి గట్టు మీద కూర్చుని, అలసటతో కొంతసేపటికి అలాగే నిద్రపోయాడు.

అరేబియా కథ



మర్నాడు పొద్దున కొందరు వర్తకులు ఆ దారినపోతూ, అజీబ్‌ను చూసి గుర్తుపట్టారు. అతన్ని నిద్రలేపి, తమ దగ్గరున్న రొట్టెలూ, పాలూ ఇచ్చి ఆకలి తీర్చుకోమన్నారు. ఆ తరవాత, "ఇక్కడికెందుకు వచ్చావు, అజీబ్ ?" అని అడిగారు.

"నాకు జీవితం మీద విరక్తి కల్గింది. ఇకపై నేను వర్తకం చేయను," అన్నాడు అజీబ్.

అజీబ్ స్వభావం ఎరిగి ఉన్నవాళ్ళు కావడంతో, ఆ వర్తకులు, అజీబ్‌కు కావలసిన వసతులు ఏర్పాటు చేయడానికి, తమ నౌకర్లలో ఇద్దరిని అక్కడ వదలివెళ్ళారు. పోతూ, పచ్చికబయలు బావిగట్టు మీద ఒక మహాత్ముడు బస చేస్తున్నట్టు దారిలోని గ్రామాల ప్రజలకు తెలియజేశారు.

ఈ వార్త తెలియగానే ఆయా గ్రామాల ప్రజలు, ఆ బావి దగ్గరికి వచ్చి, అజీబ్‌కు ఒక కుటీరం నిర్మించి ఇచ్చారు. అజీబ్ సమస్యలతో వచ్చేవారికి తగిన సలహాలు ఇవ్వడంతో, అక్కడ కూడా ఆయనకు గౌరవమర్యాదలు లభించాయి.

అజీబ్ వ్యాపారం వదిలిపెట్టి, పట్టణం నుంచి ఎక్కడికో వెళ్ళిపోయాడని తెలిసి, అసూయాపరుడైన అతని పొరుగింటి సయ్యద్ సంతోషించాడు. కాని, కొంత కాలానికి, అజీబ్ జీవితంలో ఏర్పడిన కొత్త పరిణామం గురించి విని, విషాదం చెందాడు. ఒకనాడు అజీబ్‌ను చూడడానికి బయలుదేరాడు.

సాయంకాల సమయంలో శిష్యుల మధ్య కూర్చుని మాట్లాడుతున్న అజీబ్‌ను సమీపించి నమస్కరించి "మీతో నేను రహస్యంగా ఒక విషయం గురించి మాట్లాడాలి," అన్నాడు సయ్యద్.

అజీబ్ శిష్యులను బయటకు పొమ్మని సైగచేశాడు. వాళ్ళు వెళ్ళిపోయారు.

"స్వామీ, మీరు నన్ను గుర్తుపట్టలేదా ? నేను మీ పొరుగింటి సయ్యద్‌ను. మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలని

వచ్చాను. అది ఇక్కడ చెప్పడం బావుం డదు. అలా పచ్చికబయలు మీదికి వెళ్ళా మంటే చెబుతాను,'' అన్నాడు సయ్యద్.

''అలాగే,'' అంటూ అక్కడి నుంచి లేచి, సయ్యద్‌ను అనుసరించాడు, అజీబ్.

ఇద్దరూ కుటీరానికి దూరంలో ఉన్న పచ్చికబయలును చేరుకున్నారు. ''ఆ బావిలో ఒక విచిత్రం ఉన్నది. చూపుతాను, రండి!'' అంటూ అజీబ్‌ను బావి దగ్గరికి తీసుకుపోయాడు, సయ్యద్.

అజీబ్ బావిలోకి తొంగి చూశాడు. వెంటనే అజీబ్‌ను పట్టి నూతిలోకి తోసి, సయ్యద్ వేగంగా ఇంటిదారి పట్టాడు.



అజీబ్‌కు ఈత రాదు. అయినా ఆ బావిలో జలదేవతలు ఉన్నాయి. వాటికి అజీబ్ మంచితనం నచ్చింది. పైగా అంత వరకూ నిర్మానుష్యంగా ఉన్న పచ్చిక బయలు, అతని రాక తరవాతే, మనుషు లతో కళకళలాడుతున్నది. ఆ కారణంగా జలదేవతలు, అతన్ని మునిగిపోకుండా కాపాడి మెట్టు మీద కూర్చోబెట్టాయి.

''నిన్ను చూస్తే మాకెంతో ఆనందంగా ఉన్నది. నీ మూలంగానే ఇక్కడికి సుల్తాను రానున్నాడు,'' అన్నవి జలదేవతలు.

''ఎందుకు?'' అన్నాడు అజీబ్.

''సుల్తాన్ కుమార్తెను దయ్యం పట్టి పీడిస్తున్నది. ఆ దయ్యాన్ని వదలగొట్ట డానికి సుల్తాన్ ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని ప్రయోజనం కలగలేదు. ఆఖరికి నిన్ను చూడడానికి రేపు వస్తు న్నాడు,'' అన్నవి జలదేవతలు.

''అలాగా,'' అన్నాడు అజీబ్.

"నువు పెంచుతూన్న నల్లపిల్లి మీసాల్లో, ఒక వెంట్రుక తీసి, దాన్ని కాల్చి, ఆ పొగను సుల్తాన్ కూతురి ముక్కు దగ్గిర చూపా వంటే, దయ్యం వదులుతుంది,'' అని జలదేవతలు అతన్ని గట్టు మీదికి చేర్చాయి.

కుటీరం చేరగానే అజీబ్ పిల్లి మీసం తీసి జాగ్రత్తపరిచాడు.

మర్నాడు సూర్యోదయం కాగానే భటులు వచ్చి, సుల్తాన్ వస్తూన్న వార్త

చెప్పారు. మరి కొంతసేపటికి సుల్తాన్ వచ్చి విషయం తెలియచెప్పాడు.

అజీబ్ యువరాణిని అక్కడికి తీసుకు రమ్మన్నాడు. భటులు వెళ్ళి యువరాణిని తీసుకువచ్చారు. ఆమె దిక్కులు చూస్తూ, పిచ్చిగా మాట్లాడుతూ అక్కడికి వచ్చింది.

అజీబ్ భద్రపరచి ఉంచిన పిల్లి మీసాన్ని, ఒక పళ్ళెంలోని నిప్పులో వేసి, ఆ పొగను యువరాణి ముక్కు పుటాల కింద చూపాడు. వెంటనే యువరాణి కిందపడిపోయి, కొంతసేపటికి గాఢనిద్ర నుంచి లేచినట్టులేచి, మౌనంగా తండ్రి కేసి చూసింది!

సుల్తాన్ పరమానందం చెంది, పక్కనే ఉన్న వజీరు కేసి తిరిగి, ''ఈ మహాత్ముణ్ణి ఎలా గౌరవించాలో నాకు తెలియడం లేదు,'' అన్నాడు.

''ప్రభూ, యువరాణికి పట్టిన దయ్యం వదలగొట్టినవారికి ఆమెనిచ్చి పెళ్ళి చేస్తామని లోగడ మీరు నాతో అన్న విషయం మరిచిపోయారా?'' అన్నాడు వజీరు.

''అందుకు ఈయన అంగీకరించాలి కదా!'' అన్నాడు సుల్తాన్.

''ఆ విషయం నేను చూస్తాను,'' అని వజీరు, సుల్తాన్ అభిప్రాయాన్ని అజీబ్‌కు తెలియజేశాడు. యువరాణిని పెళ్ళాడడానికి అజీబ్ అంగీకరించాడు. ఇరువురికీ ఘనంగా వివాహం జరిగింది.

మరి కొన్నాళ్ళకు సుల్తాన్ జబ్బుపడి మరణించడంతో, అజీబ్ సింహాసనాన్ని అధిష్ఠించాడు.

అజీబ్‌కు పట్టిన అదృష్టం విని, అసూయాపరుడైన సయ్యాద్ మతిచలించి, పూర్తిగా పిచ్చివాడైపోయాడు.

ఒకనాడు సుల్తాన్ అజీబ్ తన పరివారంతో నగరపర్యటన చేస్తున్నప్పుడు, చిరిగిన గుడ్డలతో కేకలు వేస్తూ సయ్యాద్ కనిపించాడు. అజీబ్ అతణ్ణి గుర్తుపట్టి, అతనికి వైద్యం చేయించమనీ, పిచ్చి కుదిరిన తరవాత, అతనికి వెయ్యి బంగారు నాణాలు ఇవ్వమనీ అధికారులకు ఆజ్ఞ ఇచ్చాడు!



# ఆర్కిటిక్ సీల్ జలచరాలు

ఆర్కిటిక్ సముద్ర ప్రాంతంలో మంచుగడ్డల మీద సీల్ జలచరాల పిల్లలు మెల్లమెల్లగా పాకేప్పుడు వాటి మృదువైన లేత వసుపురంగు మీద సూర్యకిరణాలు పడి మిలమిలా మెరుస్తాయి. అమాయకమైన ముఖాలతో, పెద్ద పెద్ద ఊదా కళ్ళతో, సీల్ పిల్లలు ఎంతో అందంగా ఉంటాయి.

మార్చి నెలారంభం నుంచి ఏప్రిల్ నెలాఖరు దాకా సాగే రెండునెలల కాలఘట్టంలో పుట్టే సీల్ పిల్లలన్నీ ఒక వారం రోజులకన్నా ఎక్కువకాలం జీవించలేకపోతున్నాయి. ఎందుకంటే పుట్టిన ఒక వారంలోపలే వాటి చర్మాల రంగు ఊదాగా మారిపోతుంది. ఇలా మారిపోయే లోపలే వేటగాళ్ళు వచ్చి పడి వాటిని చంపి చర్మాలు వొలుచుకుపోతారు. ఇలా యేటా కొన్ని వేల సీల్ పిల్లలు చంపబడుతున్నాయి. వాటి మృదువైన చర్మం సంపన్న స్త్రీలు ధరించే సున్నితమైన కోట్లు తయారీకి ఉపయోగించబడుతున్నది.

ఈ శతాబ్దారంభంలో ఈ ప్రాంతంలో ఇరవై మిలియన్ల వరకు ఉన్న ఈ జంతువులు, ప్రస్తుతం ఒక మిలియన్‌కు తగ్గాయి. ఇదే విధంగా సాగితే మరో పదేళ్ళలో ఈ జంతు సంతతి నిర్మూలమైపోయే ప్రమాదం ఉందంటున్నారు న్యూ ఫౌండ్‌లాండ్‌కు చెందిన 'గ్రీన్ పీస్' సంస్థ వాళ్ళు. ఈ సంస్థ సీల్‌పిల్లల వేటను నిరోధించడానికి కృషి చేస్తున్నది.

ఆర్కిటిక్ సీల్ సంతతికి చెందిన ఈ జల జంతువులు సస్తన జంతువులు. వీటిలో ఏనుగు-సీల్ రకం జంతువులు నాలుగు టన్నుల బరువూ, ఆరు మీటర్ల పొడవూ ఉంటాయి. ఇవి నీళ్ళలోని చేపలు, నత్తలు, పీతలు మొదలైన వాటిని పట్టి తింటాయి. చెవులు కనపడనంతగా చాలా చిన్నవి కాని, వీటికి వినికిడి శక్తి చాలా ఎక్కువ అని చెబుతారు.

నీళ్ళ ఉపరితలంలో ఊపిరితిత్తుల నిండా గాలి పీల్చుకుని, నీళ్ళలోకి మునుగుతాయి. నీళ్ల లోపల ఉండేప్పుడు గుండె నెమ్మదిగా కొట్టుకోవడంవల్ల ఇవి చాలాసేపు లోపల ఉండగలుగుతాయి. నీళ్ళలో ఎంతో చురుకుగా ఉండే ఈ జంతువులు నేలమీదికి వస్తే చాలా మందకొడిగా ఉంటాయి!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



G. Prabhakar

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నోటిలో ఏమిటది? రెండవ ఫోటో: హరినామ స్మరణ మిది!

పంపినవారు: వడాల శివశంకర మూలారెడ్డి, కృష్ణలంక, విజయవాడ-52 0013

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. హుయాన్‌త్సాంగ్ 2. చాళుక్య వంశం 3. అల్లాఉద్దీన్ ఖిల్జీ 4. వద్నాలుగేళ్ళు
5. పాటలీపుత్రం

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.


CHANDAMAMA


మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం
SUPER
RIN
STRIKES WHITER
సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.
హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# రాతలో విజేత నటరాజ్ పెన్సిల్

నటరాజ్‌తో రాయడంలో మజాయే వేరు. ఇదే, నటరాజ్ పెన్సిలును ఎన్నుకునే వారందరి మనసుల్లోని మాట. అవును మరి. నటరాజ్ ఎంతో చక్కగా రాస్తుంది. సున్నగా, నల్లగా, నున్నగా, ముక్క విరగకుండా. అందుకే నటరాజ్, ఆ రకానికి చెందిన మరే ఇతర పెన్సిలుకన్న ఎక్కువ కాలం మన్నుతుంది, ఝామ్మని రాస్తూ పోతుంది.







## నటరాజ్ పెన్సిల్

అలుపు లేకుండా రాస్తుంది, అధిక కాలం వస్తుంది.

ఉత్కృష్ట ఉత్పాదనల నిర్మాతలు
హిందుస్తాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 001.